# పీఠిక

శ్రీయుత్ ఎస్. శ్రీనివాసయ్యంగారు, దక్షిణ భారతమునలంకరించిరి. ఈ మహావ్యక్తి కీర్తి అరవదేశమునందేగాక తెలుగుదేశమునందును ఇతర ప్రాంతములందును వ్యాపించియుండెను. ఈ అసమాన వ్యక్తితో సుమారు ఇరువదియైదుసంవత్సరములు అనుచరుడనుగానుండి అనేకసభలకును, అనేక రాష్ట్ర అఖిలభారతకాంగ్రెసు సమావేశములకును వెళ్లు భాగ్యము నాకు లభించెను. వీరితోసంభాషించుట హృదయాహ్లాదకరముగ నుండుటయేగాక ఎన్నియో నూతనవిషయముల తెలుసుకొను వీలుకలిగినది. వీరికి పట్టుదల, ధైర్యసాహసములు, ప్రజ్ఞ అపారము. వానిగూర్చి నాకు తెలిసినంతవరకు ప్రపంచమునకు వెల్లడింప ప్రయత్నించెదను. శ్రీగాంధీగారితో భిన్నాభిప్రాయము జనించినపుడు నిర్దాక్షిణ్యముగ తన యభిప్రాయమును వెల్లడించి తానెంతో శ్రమపడిన సంస్థయగు కాంగ్రెసును విడనాడిరి. శ్రీగాంధీగారేగాక ప్రముఖు లెందరో వీరిని మరల కాంగ్రెసునందు చేరుడని అనేకముగా ప్రాధేయ

పడిరి. కాని శ్రీగాంధీగారితో కలిసి తా నెన్నడు వ్యవహరింప వీలుకాదు కావున అందరి కోరికల విఫలముగావించిరి. ఈ మహనీయుని జీవితమును వ్రాయుట కష్టసాధ్యము. ఇందు లోపము లున్నచో చదువరులు నన్ను క్షమింతురుగాక! ఈ పుస్తకము ప్రచురించుటలో శ్రీమార్క్‌గారి కుటుంబమును గూర్చి వివరము లనేకములు శ్రీమతి ఎస్. అంబుజమ్మాళ్ గారివల్ల లభించెను గావున వీరికి నాకృతజ్ఞతను తెల్పుచున్నాను.

మదరాసు
24-2.55

వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి.

# శ్రీమాన్ ఎస్. శ్రీనివాసఅయ్యంగారి

# జీవితము



శ్రీమాన్ అయ్యంగారు 1874-వ సం॥ సెప్టెంబరు తే 11 దీన, రామనాథపురమున జన్మించిరి. సామాన్యులైన వీరి తండ్రి శ్రీ ఎస్. శేషాద్రిఅయ్యంగారు ఒక శ్రీవైష్ణవులు. బాల్యమునందేగాక వయస్సు వచ్చిన మీదటఁగూడ కష్టములకుపాలై స్వశక్తివల్ల కుటుంబ వ్యవహారముల నిర్వహించుచుండిరి. ప్రారంభమున పాంబన్ అమీన్ కోర్టున వీరు ప్లీడరుగ నుండిరనియు, ఆరోజులలో అమీనులకు మేజస్ట్రేటు అధికారము కూడ కలదనియు తెలియుచున్నది. కావున శ్రీ శేషాద్రిఅయ్యంగారు ఒకమోస్తరుగ పాంబనున కాలక్షేపము జరుపుచుండిరి. ఆరోజులలో నీప్లీడర్లు న్యాయశాస్త్రవిద్యగడించి పరీక్షలలో ప్యాసుగావలసిన అవసరములేకుండెను. బుద్ధిసూక్ష్మతవల్లను, లోకవ్యవహారములలోని అనుభవమువల్లను, తెలివి తేటలు సంపాదించుకొని చక్కఁగా మాట్లాడుటకు శక్తియున్నచో కోర్టులలో ప్లీడర్లుగా వ్యవహరింప

వీలుండెను. శ్రీ శేషాద్రిఅయ్యంగారుగారికి అరవము నందేగాక సంస్కృతమునందుకూడ చక్కని ప్రవేశ ముండెనని తెలియుచున్నది. ఐరోపీయనుల ఎదుట ఒకమోస్తరుగా సంభాషించుటకు కూడా : వీరికి శక్తియుండెనని తెలియుచున్నది. వార్తాపత్రికలు పుస్తకములు మున్నగువానినుండి కొన్ని అంశములు తెలిసికొని ఒకమోస్తరుగా ఇంగ్లీషుపుస్తకమును చదువుటను ప్రారంభించిరట. ఐతే ఇంగ్లీషున చేవ్రాలుచేయుటగూడ వీరికి శక్యముగాదట.

స్వయంకృషివల్ల ఇంగ్లీషుపుస్తకము చదవనేర్చిరి కావునను గురువువద్ద శిక్షలేనందువల్లను వీరి ఆంగ్ల పరిచయము వృద్ధికాలేదు. వీరు కోర్టులలో అరవ ముననే వాదించుటనుగూర్చి అనేకులు పొగడు చుండుటను విని శ్రీరామేశ్వర పండారసన్నిధికి వీరిని ప్లీడరుగా నియమించెను. శ్రీశేషాద్రిఅయ్యంగారి శక్తిని గుర్తించి వీరిని పిలిపించి శివగంగ జమీాకు ప్లీడరుగా నియమించిరి. అప్పుడు రామనాథపురము శ్రీపొన్నుస్వామి దేవరవారికిని, వారి అన్నభార్య యగు జమీాందారిణికిని కలతలేర్పడి శ్రీముత్తు రామలింగ సేతుపతిగారిని స్వీకారపుత్రునిగావించిన మీాదట దానినిగూర్చి గొప్పకలతలేర్పడె శ్రీపొన్ను స్వామి దేవరగారు శ్రీశేషాద్రిఅయ్యంగారిని రామ

నాథపురసంస్థాన న్యాయవాది గావించిరి. శ్రీపొన్ను స్వామి దేవరగారు మరణించినందున రామనాథపుర సంస్థానకోర్టు వ్యవహారములనేగాక సంస్థానీకుల కుటుంబవ్యవహారములనుగూడ నిర్వహించుచుండిరి. శ్రీపొన్నుస్వామి దేవరగారి ముగ్గురు కుమాళ్లును మైనర్లగుటచే కనిష్ఠకుమారుఁడు పాండిదొర మేజరై జమీను వ్యవహారముల నిర్వహించుకొనువరకు శ్రీ శేషాద్రి అయ్యంగారే అన్నిపనుల నిర్వర్తించు చుండిరి. శ్రీపొన్నుస్వామి దేవరగారి కుమాళ్లకు వయస్సురాగానే చాలాకాలము శ్రీ శేషాద్రిఅయ్యం గారు కోర్టుపనులు మాత్రము చూచుచుండిరి.

శ్రీ ముత్తురామలింగసేతుపతిగారి స్వీకార కేసున వీరు మొట్టమొదట చెన్నపట్టణమునకు వెళ్లవలసి వచ్చెను. చెన్నపట్టణమునకు రాగానే అప్పటి వకీళ్లలో ప్రముఖులైన సర్. వి. భాష్యం అయ్యం గారితోను, సుప్రసిద్ధ బారిస్టరగు శ్రీనార్టనుతోను శేషాద్రి అయ్యంగారు సంప్రతించుచుండిరి. ఆమీఁద ఎప్పుడు చెన్నపట్టణమునకు వచ్చినను, నార్టన్‌గారికి స్వీకార కేసువిషయమై తెలియజేయవలసిన అంశ ములు దెలియజేయుచు నార్టను మన్ననకు పాత్రు లైరి. ఈ పై కేసు సలహాదారులుగ నుండుటవల్లనే ప్రబలహైకోర్టు న్యాయవాదియగు సర్. వి.భాష్యం

అయ్యంగారు అభిమానమునకు పాత్రులైరి. రామ నాథపురసంస్థానము పనిమీద శేషాద్రిఅయ్యంగారు చెన్నపట్టణమువచ్చినపుడెల్ల, సర్. వి. భాష్యం అయ్యంగారు లక్ష్మీవిలాసమున బసచేసెడివారు.

అప్పుడప్పుడు తల్లినిపోగొట్టుకొనిన అభిమాన పుత్రుడగు శ్రీమాన్ శ్రీనివాసఅయ్యంగారును చెన్న పట్టణమునకు వెంటపెట్టుకొని వచ్చెడివారు. శేషాద్రి అయ్యంగారు 3 పెళ్లిళ్లు చేసికొనిరి. మొదటి భార్యకు సంతానము లేనందున భార్యతో చెప్పకనే దేవాలయమున రెండవపెళ్లి చేసికొని యింటికివచ్చి జ్యేష్ఠభార్యనుపిలచి హారతియివ్వమని చెప్పెనట. మొదటిభార్య దిక్కుతోచక హారతిని సమర్పించెనట. శ్రీమాన్ శ్రీనివాసఅయ్యంగారుతల్లి రెండవభార్య, శ్రీమాన్‌గారి మూడవయేట మరణించెను. ఆమీఁద మరల మూడవపెళ్లి చేసికొనిరి. ఈ భార్యకు ఎస్. వెంకటేశఅయ్యంగారు రెండవకుమారుఁడు జన్మించెను. మూడవభార్యకూడ శ్రీ వేంకటేశ అయ్యంగారికి మూడేండ్లు పూర్తిగాకముందే మర ణించెను గాని శ్రీ శేషాద్రిఅయ్యంగారు ఆమీఁద వివాహప్రయత్నమును మానుకొనిరి. శ్రీమాన్ శ్రీనివాసఅయ్యంగారిని పెంచి పెద్దకావించినది వీరి మేనత్తయగు వృద్ధురాలు. తల్లి లేనిబాలుఁడని తండ్రి

చూపు పరామర్శవల్ల మొండిశిఖండిగా శ్రీమాన్ బాల్యమున వర్తించెడివారు. ఈక్షణమున మధుర మీనాక్షీ దేవాలయమునందలి ఏనుగు తమ యింటి వాకిటకు వచ్చినగాని తిండితినను అని పట్టుబట్టిన మీదట తండ్రిగారికిఁ గల ప్రాభవముచే ఆ ఏనుగు ఇంటివాకిటకు వచ్చుటయు శ్రీమాన్‌గారు ఆమీద అన్నము తినుటయు జరిగెడిది. శ్రీమాన్ ఏది కోరినను తండ్రిగారు సరఫరాచేయుటవల్ల వీరికి మధురలో ఏర్పడిన పలుకుబడియే కారణమని చెప్ప వచ్చును. మధురపురవాసులు దానప్ప మొదలి అగ్రహారం శ్రీ శేషాద్రిఅయ్యంగార్ అని చెప్పుకొనెడి వారు. చెన్నపురిలో శ్రీభాష్యంఅయ్యంగారు బంగళాలో కుమారునితో వీరుబసచేసియున్నప్పుడు రాత్రి 9 గంట లప్పుడు, ఈక్షణమున నాకు బొమ్మ రైలుఇంజను కావలెను అని శ్రీమాన్ అల్లరి ప్రారంభించెను. ఎవరేమిచెప్పినను వినక కేకలువేయు చుండగ వీరివలె అల్లరిసాగించు భాష్యంఅయ్యంగారి అభిమానపుత్త్రుఁడు దేశికాచారిని శ్రీమాన్ దగ్గఱకు తీసికొనివచ్చి నిలఁబెట్టిరి. శ్రీమానునుజూడ గానేఁ దేశికాచారిసాగించు అల్లరిని మానెను. కాని శ్రీమాన్ అల్లరిసాగించుచుండెను. బండిమీద పట్టణ మున బజారునకువెళ్లి అంగళ్లువెదకి ఒక బొమ్మ

ఇంజనుకొని తెచ్చియిచ్చినమీదటనే రాత్రి 9 గం॥ శ్రీమాన్ హారము చేయుట మానెను. రామనాథపుర సంస్థానపనుల నిర్వహించుచున్నప్పుడు మధురలో కూడా ఒక గృహము నిర్మించుకొని తనకుమారుడు శ్రీమాన్ చదువుసాగుటకు ఏర్పాట్లు కావించెను. ఆమీద కొంతకాలమునకు శ్రీముత్తు రామలింగ సేతుపతిగారికిని, శ్రీ శేషాద్రి అయ్యంగారు గారికిని సంస్థానవిషయములఁగూర్చి భిన్నాభిప్రాయములు జనించి కలతలు ఏర్పడగ రామనాథపురసంస్థానముతో పూర్తిగ సంబంధమువదలుకొని, మధురలో స్థిరవాస మేర్పఱచికొని సంస్థానమున వేతనమును గూడ సంపాదింపఁగలిగిరి. మధురలో "చానప్ప మొదలి" అగ్రహారము శ్రీ శేషాద్రిఅయ్యంగారన్నచో, మధుర లోని పిన్నలు పెద్దలు వీరిని గౌరవముతో జూచు చుండెడివారు. మధురలో పౌరాగ్రేసరులుగ వ్యవహ రించెడివారు. వీరిమాటకు భిన్నమగు అభిప్రాయ మును ఏపౌరులును, మధురలో వీరిమాటకు ఎదురు లేదు గావున వీరికున్న ప్రాముఖ్యత వెల్లడియగు చున్నది. ఇంటిలో ఇద్దరు వంటవాండ్రు, వీరి కుటుంబీకులే కాక శివగంగనుండివచ్చు మిత్రులు బంధువులు మున్నగువారును, వీరి కుమాళ్లకు విద్య నేర్పు ఉపాధ్యాయులును, ఇంక అనేకులు వీరి ఇంటి

వద్దనే అన్నపానాదులు సేవించుచుండిరి. మధురలో ఏసభ జరిగినను వీరి సలహాప్రకారమే కార్యనిర్వాహకులు కార్యక్రమము సాగించువారు కావున రాష్ట్ర కాంగ్రెసు సభలకు విరాళము లేగాక, వీరి సలహాలు కూడ లభించుచుండెను. దొడ్డిలో పశువులు, రెండెద్దుల సవారిబండి మున్నగు సౌకర్యములన్నియు శ్రీఅయ్యంగారు కలిగియుండెను. మధురలో రాష్ట్ర గవర్నర్లను ఆహ్వానించుటయేగాక వారికి అన్ని మర్యాదలు సాగుటకు తగు ఏర్పాట్లు వీరుగావించుచు, సామాన్యులు బీదలు మున్నగు వారి కష్టసుఖముల గవర్నర్లకు తెలియఁజేయుచుండెడివారు.

శ్రీ శేషాద్రిఅయ్యంగారుగారి దైవభక్తి అపారము. రోజూ ఉదయము పండితుల దగ్గఱనుంచుకొని నిత్యకృత్యముల తీర్చుకొని ఆమీఁద రెండుగంటలకాలము శ్రీమద్రామాయణ పారాయణముగావించి యిద్దరు పండితులతో భోజనముచేసెడివారు. జప తపాదులు రామాయణ పారాయణము పూర్తియగునప్పటికి 12 గంట లగును గావున ఆమీఁదనే భోజనము చేసెడివారు. ఉదయము కాఫీ త్రాగుటకుకానీ, ఫలహారముల తినుటకు కానీ వారు ఇష్టపడువారు కారు. పెద్దగొంతుకతో శ్రీమద్రామాయణమును చదువుచుండగా ఇంటియందలి ఆడవారు పిల్లలేగాక

చుట్టుప్రక్కలనున్న పిల్లలుకూడ రామాయణ పారాయణము వినుటకు వచ్చెడువారు. పూజ ముగియగానే అక్షింతలు తులసి పంచకొంగున ముడివేసికొని యుంచుకొనెడివారు. ఎదుట కనఁబడిన పిల్లలకు అందరికినీ నెత్తిన అక్షింతలు చల్లి తులసీదళముతో ఆశీర్వదించెడివారు. ఇంటిలోని పిల్లలు నిద్రపోవుచున్నను వారినెత్తిన పూజాక్షత లను చల్లి దీనితో వారి నిద్ర వదలునని చెప్పెడివారు.

ఒకప్పుడు వీరికి జబ్బుచేసి మెడమీఁద రాచపుండు ఏర్పడెను. ఇంగ్లీషు చికిత్సయందుగానీ ఆపరేషనుల యందుగానీ వారికి నమ్మకములేనందున కాలినడక మీఁద తిరుపతివెళ్లి శ్రీ వేంకటేశ్వరస్వామికి ప్రార్థన చెల్లించెదనని చెప్పినమీఁదట పుండు నెమ్మదిగ మానెనట. ఆమీఁద ఆరోజులలో రైళ్లులేవు గావున కట్టెబండ్లమీఁద సామానులనేగాక యింటివారి నందఱినీ ఎక్కించుకొని, మార్గమున అక్కడక్కడ ఆగుచు, వంటచేసికొనుచు, కాలినడకమీఁదనే శ్రీ శేషాద్రిఅయ్యంగారు మధురనుండి తిరుపతికి వెళ్లిరి. తిరుపతి చేరువరకు ఒకపూటమాత్రము భోజనము చేయుచు, తులసీదళమును పూజకాఁగానే ఆరగించుచు, తీర్థముపుచ్చుకొనుచు మరల స్వస్థలము చేరునప్పటికి రాచపుండు మాయమాయెను. ఈసంభ

వము నలుగురికిని తెలియుటకుఁగాను తన పేరునకు ముందు 'శ్రీ' అక్షరమును వ్రాసెడివారు. ఇంతే గాక పెద్దకుమారునికి శ్రీనివాసన్, రెండవకుమారునికి శ్రీవేంకటేశన్ అని పేరుపెట్టిరి.

చెన్నపట్టణవాసము వీరి కెంతమాత్రము మనస్కరింపదు. ఎటు జూచినను అశుద్ధి, ఎంగిలి, అనాచారములు, దుర్గంధము, చెన్నపట్టణమున కనఁబడుచున్నందున మధురవదలి ఆఖరురోజులలో ఎచ్చటికిని వెళ్లువారుకారు. శ్రీమాన్ శ్రీనివాసఅయ్యంగారు వారికి వయస్సువచ్చి చెన్నపట్టణమున వాసమేర్పఱచికొని కీర్తిగడించినమీదట తండ్రిగారిని చెన్నపట్టణమునకు రమ్మని ఎంత ప్రోద్బలపఱచినను మధురను వదలి ఎచ్చటకు రానని నిష్కర్షగ చెప్పిరి. కుమారుని పైనున్న అభిమానమువల్ల సంవత్సరమున కొకమారు చెన్నపట్టణమునకువచ్చి నెలరోజులు మైలాపూరున కుమారునితో నుండెడివారు. శ్రీమాన్ అయ్యంగారు వీరికుటుంబముతో చెన్నపట్టణముననేయుండి వేసవిసెలవు లప్పుడు మధురలోనుండుట అలవాటు. మధురలోని యింటిలోనుండుట శ్రీమాన్ గారికే గాక వీరి కుటుంబీకులకుగూడ సంతృప్తి గలిగించుచుండెను. ఆయింటి నల్లచేవగుంజలు, చిత్రించిన తలుపులు, తెల్లని సున్నపుగోడలు, బయట ఎండబాధ

యుండినను ఇల్లు చల్లగానుండుటయు మున్నగు అంశములంగూర్చి శ్రీమాన్ ప్రశంసించెడివారు. రాత్రులలో మధురలోని బిచ్చగాండ్ర కేకలవల్ల అనేకులకు నిద్దురచేటు ఏర్పడుచుండెను. మధుర వీథులలోని జలదారులకంపు, గాడిదలకూతలు అందరికి తెలిసినదేను. ఇటీవల పరిస్థితి మారినదని తెలియుచున్నది. శ్రీ శేషాద్రిఅయ్యంగారు మధుర నుండి రామనాథపురమునకు రాకపోకలు సాగించు రోజులలో వీరు ఒకదంతపు పల్లకీన ప్రయాణము సాగించెడివారు. ఆ పాతపల్లకి చాలకాలము మధుర లోని యింటిలో నుండియుండెను. మధురవదలి శ్రీమాన్ వారికుటుంబము మదరాసునకు వెళ్లినపు డెల్ల తండ్రిగారు కుమారునికి నూతనవస్త్రములు తెప్పించి యిచ్చెడివారు. ఆరోజులలో మధుర చీరెలకు ప్రసిద్ధియుండెడిది కావున కొన్నిసమయము లందు ఎంతధరయైనను ఇచ్చి తెప్పించి యీ చీరల శ్రీమాన్ కుటుంబమునకు ఇచ్చెడివారు. కావున స్వదేశీబట్టలపై వీరికి ఆదరణ హెచ్చని తెలియు చున్నది.

ఒకప్పుడు శ్రీ శేషాద్రిఅయ్యంగారు చెన్న పట్టణము వచ్చియున్నప్పుడు అనగా 1903 సం॥న అఖిలభారతకాంగ్రెసు సమావేశము తటస్థించెను.

శ్రీమాన్ గారు కాంగ్రెసు మహాసభకు వెళ్లుటకు సిద్ధమగుచుండగా వారి తండ్రిగారు తాము గూడ సభకు వచ్చెదమని పట్టుబట్టిరి. వీరివద్ద నొక ట్రంకు పెట్టె యుండెడిది. ఇందు ఒక పాత ఆల్పాకా లాంగ్ కోటు, సరిగెధోవతి, అంగవస్త్రము, చాకలి మడతవిప్పని ఒక జలతారు అంగవస్త్రము, ఒక షర్టు మున్నగునవి యుండెడివి. వీరు రామనాథపుర సంస్థాన ప్లీడరుగా నున్నరోజులలో ధరింపఁబడు దుస్తు లివి యని తెలియుచున్నది. ఈదుస్తుల ధరించుకొనియె వీరు పైకి వెళ్లెడివారు. నల్ల ఆల్ పాకా కోటుమీద సరిగపంచెను ఎడమప్రక్క వ్రేలాడవేసికొని దానిమీద ఒక జలతారు ఎఱ్ఱ శాలువను మడతవిప్పక ఎడమభుజముపై ధరించెడి వారు. ఎఱ్ఱసరిగపాగా, ముఖమున ఊర్ధ్వపుండ్ర ములు, చెవులలో సీమకమలములపోగులు పై జేబిలో బంగారు గడియారము, చేతిలో వెండిపొన్నుకఱ్ఱ, కాలిలో కాన్పూరు పాదరక్షలు ఇవన్నియు తగిలించుకొనునప్పటికి గంటసేపు పట్టెడిది. ఇంటిలో చిన్నపిల్లలు శేషాద్రిఅయ్యంగారు దుస్తులధరించుట చూచి నవ్వెడివారు. ఆల్పాకాకోటున సచ్చటచ్చట రంధ్రము లుండెడివి కావున 'శ్రీమాన్‌వలె ఏల షరాయి, బూట్సు తగిలించుకొని బయలుదేరరాదు'

అని ఎవరైనా చెప్పినప్పుడు తాను పూర్వకాలపు మనిషి.యనియు, వృద్ధుడననియు, పాతదుస్తులే తనకు సంతృప్తి గలిగించుననియు చెప్పెడివారు. దుస్తుల ధరించుకొని బయటకు వెళ్లుటకు సిద్ధపడగానే కుమారులు శ్రీమాన్ గారు కాంగ్రెసు సమావేశమునకు రావద్దని చెప్పుతూ ముందువలె సభ నెమ్మదిగా జరగదనియు సూరత్ నందువలె అల్లరి యేర్పడుననియు తండ్రిగారు ఇబ్బందిపడుదురనియు చెప్పెను. కాని తండ్రిగారు శ్రీమాన్ గారిమాటను వినక కాంగ్రెసు సమావేశమునకు తాను తప్పక వెళ్లవలెనని పట్టుబట్టుచు, అల్లరిలో నీవు తగుల్కొన్నప్పుడు నేనేల యింటిలోపడియుండవలెనని చెప్పిరి. సూరత్ అల్లరిలో శ్రీమాన్ గారే గాక యనేకులు చిక్కుపడిరి. కాని వీరితండ్రి వీరిమాటలు వినలేదు.

తనకుమారుడు మధురలోనే న్యాయవాదిగ నుండి యగ్రేసరుడై కీర్తిగడించుటయేగాక యపార ధనము సంపాదింపవలయుననియుగూడ నప్పుడప్పుడు శేషాద్రిఅయ్యంగారు చెప్పెడివారు. కాని కుమారుడు శ్రీమాన్ చెన్నపట్టణమున తప్ప ఏన్యాయవాదియు ఉత్తమశ్రేణికి రానుపీలుకాదు కావున, ధనమార్జించుటకు గూడ హైకోర్టున నవకాశములు హెచ్చునియు చెప్పినమీాదట తండ్రిగారు కుమా

రని ప్రోత్సహపఱచరైరి. శ్రీ శేషాద్రిఅయ్యంగారు గారికి మరణించునపుడు 85 సం॥ కాని ఎన్నడును ప్రాతఃస్నానము, పూజాపునస్కారములు, శ్రీమద్రామాయణ పారాయణము మున్నగువాని ముగించుకొని ఆమీద భుజించువారు. ఆఖరుదశలో 2 సం॥లు, బయటికి వెళ్లుటమాని 1916 సం॥ ఏప్రెలులో ఒక రోజు పూజాపునస్కారములు పూర్తిచేసికొని భోజనముచేసి ఆమీద పడకపై విశ్రమించుచుండగా రొమ్మున బాధకలిగి వెంటనే ప్రాణమును గోల్పోయిరి. శ్రీమాన్ ఎచ్చటనున్నను వారే తన అంత్యక్రియలు నిర్వహింపవలెనని తండ్రి చెప్పుచుండెడివారు. కావున చెన్నపట్టణమున మైలాపూరునకు మధ్యాహ్నము 2 గం॥కు వీరి మరణవార్తను తెలుపు తంతి వచ్చెను. అప్పటికి కొద్దిరోజులకుముందే శ్రీమాన్‌గారు అడ్వకేటుజనరలుపదవిని స్వీకరించిరి. రాత్రి బయలుదేరి రైలున వెళ్లినచో నాలస్యమగునని స్పెషలు రైలున మధురకు ప్రయాణమైరి.

శ్రీమాన్ అయ్యంగారు బాల్యమున రామనాథపురమున నొక వీధిబడిలో అరవము చక్కగ నేర్చికొనిరి. 1880 సం॥ మధురకు రాగానే యచ్చటి హైస్కూలునచేరి ఆంగ్లవిద్య గడించిరి. ఆమీద రెండుసంవత్సరములు మధుర కాలేజిలో చదివిరి. ఈ

రోజులలో వీరితండ్రి పలుమారు చెన్నపట్టణము వెళ్లి వచ్చెడివారు. సర్. వి. భాష్యంఅయ్యంగారింట తన యభిమానపుత్త్రుడగు శ్రీమాన్‌తో బస చేసినప్పుడు భాష్యం అయ్యంగారింటివారు 'మధుర అల్లుడు వచ్చెను' అని చెప్పెడివారట. భాష్యం అయ్యంగారే గాక శ్రీ శేషాద్రిఅయ్యంగారుకూడ శ్రీమాన్‌గారికి పెండ్లిచేయవలెనని యభిప్రాయపడిరి. మధురలో కొందఱుపిల్లల శ్రీమాన్‌గారికి కనంబఱచిరి. కాని శ్రీమాన్ పట్టుపట్టి వి. భాష్యం అయ్యంగారి కుమార్తె శ్రీరంగనాయకమ్మను వివాహమాడవలెనని పట్టుబట్టెను. ఈ సంబంధము అందఱికిని తృప్తికలిగించునని తలచిరి. శ్రీ శేషాద్రి అయ్యంగారుమాత్రము భాష్యంఅయ్యంగారి కోరికను సఫలముగావించినచో కుమారుడు చెన్నపట్టణవాసియగునని కొంతకాల మాలోచించిరి. కాని కుమారుని పట్టుదలవల్ల తండ్రిగారు తన యభిప్రాయమును మార్చుకొనిరి. వివాహమగునప్పటికి శ్రీమాన్‌గారికి వయస్సు పదహారు సంవత్సరములు శ్రీరంగనాయకమ్మగారికి ఏడేండ్లు కాని యీ వివాహము అతి వైభవముగ జరిగెను. శివగంగ, మధుర, రామనాథపురము జిల్లాలనుండి బంధువులేగాక పరిచితు లనేకులు ఈవివాహమునకుగాను చెన్నపట్టణమునకువచ్చిరి

కావున వివాహమంటపమున ముహూర్తమునాడు వేయిమందికి పైగా అతిథులు వచ్చియుండిరని తెలియుచున్నది.

ఎఫ్. ఏ. పరీక్ష కాగానే, బి. ఏ. పరీక్ష చదువుటకు శ్రీమాన్‌గారు చెన్నపట్టణమునకువచ్చి ప్రెసిడెన్సీ కాలేజిలో చేరిరి. మామగారగు శ్రీ భాష్యం అయ్యంగారి బంగళాలో బి. ఏ. పరీక్షకు చదువు చుండెడివారు. బి. ఏ. పరీక్షలో ఆర్థికశాస్త్రము, చరిత్ర, చక్కగ చదివి, బి. ఏ. పరీక్షలో ఇంగ్లీషు నందును ఆర్థికశాఖయందును యూనివర్సిటీన ప్రథములుగా నుత్తీర్ణులైరి. కావున మూడునాలుగు బంగారు పతకములు వీరికి లభించెను. ప్రెసిడెన్సీ కాలేజి విద్యార్థిగనున్నపుడు సర్.టి.విజయ రాఘవాచారి, శ్రీ జి.ఏ. నటేశఅయ్యరు, శ్రీ కె. వ్యాసరావు మున్నగువారు వీరితో చదువుకొనెడి వారని తెలియుచున్నది. అప్పటి వీరి ప్రజ్ఞనుగూర్చి సర్. టి. విజయరాఘవాచారిగారు స్వదేశమిత్రన్ పత్రికలో నీక్రిందియంశముల వ్రాసియున్నారు. "1892-93-వ, సం॥లో శ్రీ శ్రీనివాసయ్యంగారు మాతో ప్రెసిడెన్సీకాలేజి విద్యార్థిగనుండిరి. వీరి ప్రతిభను చూచి తరగతిలోని విద్యార్థులందఱును దిగ్భ్రమ చెందెడివారు. కొందరితో వారు కలసి

మెలసి వర్తించుచున్నను వీరికి అహంభావము కలదని కొంచెలు తలచెడివారు. కాలేజీలో చదువుచున్న రోజులలో తటస్థించిన యొక సందర్భమునుగూర్చి చెప్పుట యావశ్యకమని తలచెదను. మాకాలేజి ప్రిన్సిపాల్, నేను, శ్రీనివాసఅయ్యంగారు, లైబ్రరీలోనుండగా తిరువాన్కూరు మహారాజావారిని మేమున్నచోటికి వెంటఁబెట్టుకొని వచ్చిరి. అచ్చటనున్న విద్యార్థులందఱును లేచి నిలచిరి. కాని మే ముభయులము లేచినిలవక ఏదో పుస్తకము చదువుకొనుచుంటిమి. మేము ఇతరులు చెప్పునట్లు వ్యవహరించువారము కామనియు, స్వతంత్రులమనియు ప్రిన్సిపాలుగుర్తించి మమ్ము మందలింపరైరి."

ఆరోజులలో శ్రీమాఁగారికి ఇంగ్లాండువెళ్లి ఐ. సి. ఎస్. పరీక్షకు చదువుటకు కోరికయుండెడిది. కాని తండ్రిగారు శేషాద్రిఅయ్యంగారు తాను బ్రతికియున్నంతవరకు సముద్రయానము సాగింపరాదని నిష్కర్షగ చెప్పినందుచే తాను విదేశములకు అప్పట్లో వెళ్లనని వాగ్దానము చేసెను. బి. ఎల్. పరీక్షకు చదివి ప్యాసయి న్యాయవాదిగ కాలము గడపుటలో ఆరోజులలో శ్రీమాఁ గారికి ఇష్టము లేకుండెను. మైసూరు సివిల్ సర్వీసు పరీక్షకు చద

వుచు కాలముగడపుట యొకఘట్టము. ఈరోజు లలో ప్రముఖులెంద రెంతచెప్పినను శ్రీగాంధీ యభి ప్రాయముతో నేకీభవింపననియు గాంధీ కాంగ్రెసు నాయకుఁడనియు, అందుచే కాంగ్రెసునచేరననియు చెప్పుచుండెడివారు. శ్రీభాష్యంఅయ్యంగారి కుటుం బమున శిష్టాచారమునకు ఏలోపము లేనట్లే శ్రీ శేషాద్రిఅయ్యంగారి కుటుంబమువారుకూడ శిష్టా చారసంపన్నులుగానుండుటలో ఆశ్చర్యము కను పడదు. శ్రీమాన్ మామగారి యింటియందు విద్యా ర్థిగానున్నపు డితరు లెవరితోను మాట్లాడెడివారు కారు. రేయింబవళ్లు పుస్తకకాలక్షేపము చేయు చున్నందున మామగా రొకప్పుడు వకీలుగ ధన మార్జింపఁదలచినచో మౌనముగా నుండుటతగదని హెచ్చరించెడివారు. భాష్యంఅయ్యంగారింటి వా రందఱును శ్రీమాన్ ఒక విచిత్రవ్యక్తియనిచెప్పెడి వారు. ఇట్టి శ్రీమాన్ కొంతకాలమువఱకు తన యింట కెవరువచ్చినను వారు మాట్లాడుట కవకాశ మివ్వక గంటలకొలది తానే మాట్లాడుట అనేకుల కాశ్చర్యము కలిగించుచుండెను. 'అంజద్ బాగ్' బంగళావసారాలో నిటునటు తిరుగుచు వచ్చెడి వారితో మాట్లాడెడివారు. వీరివెంబడి గంటల కొలది వీరిమాటలవినుచు నిటునటు తిరుగువారు.

కొంతసేపటికి నైదారుమైళ్లు నడచినట్లు భావించెడి వారు. వచ్చినవారు సెలవుపుచ్చుకొని వెళ్లుచుండి నను, బంగళాగేటువరకు మాట్లాడుచు వారినివెంబ డించెడివారు. ఒకొక్కప్పుడు బయటికివెళ్లుటకు మోటారుకారు రాగానే యొకకాలు Foot Board మీఁదను, మఱొకకాలు బంగళామెట్లమీఁదను నుంచి యొకగంటసేపు మాట్లాడెడివారు. కాని ఎల్ల ప్పుడు వీరిమాటల వినుటకు ఎందరో ఆతురతతో శ్రీ శ్రీమాన్‌గారి బంగళాకు వచ్చెడివారు. కాంగ్రె సుతో సంబంధమువదలినమీఁదట ఒక స్నేహితుఁడు వీరిని సందర్శింపతలచితినని చెప్పెను. 'వారువచ్చుపని నాకు తెలియును గావునను నామనస్సును మార్చు టకు నాకు శక్యముకాదు కావునను నన్ను సంద ర్శించుటవల్ల నేమియు లాభముండదని చెప్పిరి' ఆ మిత్రుఁడీ మాటలవినక ఒకరోజు ఉదయము 8 గం॥ లకు శ్రీమాన్‌గారిని సందర్శించుటకు 'అంజద్ బాగ్' నకువచ్చి 8 గం॥ మొదలు 12 గం॥ వరకు కాచియుండిరి. డ్రాయింగురూములో 4 గం॥ కాలము వీరొకే ధోరణితో మాట్లాడిన పిమ్మట నామిత్రుడు వెళ్లగనే జడివాన వెలిసెనని కొందఱు తలంచిరి. వచ్చినమిత్రుఁడు తనపని సానుకూలము కాకపోయినను 'ఈరోజొక శుభదినముగా భావించు

చున్నామని' చెప్పివెళ్లిరి. శ్రీమాౘవంటి మహనీయుని మాటలవినుటకు తమ కింతకాలమున కవకాశము కలిగెననియుచెప్పిరి. వారిమాటలలో వెలిబుచ్చునభిప్రాయములు బుద్ధితీక్ష్ణతను కనబఱచు నెన్నియో నూతనాంశముల వెల్లడించుచునుగావున శ్రీమాౘగారి మాటలకు విలువహెచ్చని గుర్తింపవలెను. వీరు శ్రద్ధతో చదివి గుర్తించినయంశముల నెన్నిటినో విమర్శతో చెప్పెడివారు. హెచ్చుగ చదువుటవల్లనే వీరి ప్రజ్ఞ క్రమేణావృద్ధియాయెను.

శ్రీమాౘగారు F. L. పరీక్షకు చదువునప్పుడు మామగారగు శ్రీ భాష్యంఅయ్యంగారి పలాంతోపు ఇంటిలో వాసమేర్పఱచుకొనిరి. వారి కప్పుడు ఇరువదిరెండేండ్లప్రాయము వారిభార్య పదునైదేండ్ల ప్రాయము మధురనుండి తండ్రిగారు ఇంటిభోజన ఖర్చులకై వందరూపాయలు ప్రతినెల పంపెడివారు. ఈసొమ్ము దగ్గఱనుంచుకొని జాగ్రత్తగ ఖర్చుబెట్టుచు చదువుచుండెడివారు. ప్రతినెలపై వందరూపాయ లేవిధముగా ఖర్చాయెనను లెఖ వివరముల తండ్రిగారికి తెలియఁజేసెడివారు. వీరితండ్రిగారు ఒక్క దమ్మిడి ఖర్చుబెట్టుటకు ఆలోచించెడివారు. కావున వారికి నసంతృప్తికలుగు ఖర్చుల గావించెడివారు కారు.

శ్రీమాన్‌గారు B. L. పరీక్ష ప్యాసుకాగానే మామగారగు సర్. వి. భాష్యంఅయ్యంగారివద్ద వారి పెద్దల్లుడు దివాన్‌బహదర్ శ్రీ సి. ఆర్. తిరువేంకటాచారి, శ్రీ వి. వి. శేషాచారి, సర్. వి. సి. దేశికాచారి, యస్.గోపాలస్వామిఅయ్యంగారు మున్నగువారు జూనియర్లుగాసుండిరి. శ్రీమాన్‌గారికన్న న్యాయవాదవృత్తిలో సీనియర్లు. వీరేగాక మఱికొందరు జూనియర్లుగూడ భాష్యంఅయ్యంగారి కచ్చేరీలోసుండెడివారు. సర్. వి. భాష్యంఅయ్యంగారు బుద్ధిసూక్ష్మత, అసాధారణప్రజ్ఞ, హిందూ న్యాయశాస్త్రమున నసమానప్రతిభ కలిగియున్నందువల్ల మదరాసుహైకోర్టు న్యాయవాదులలో నగ్రస్థానము నహింపగల్గెను. కాని శ్రీమాన్‌గారి తండ్రి కనబడినపుడు తనకంటె శ్రీమాన్ తెలివితేటలు గలవాఁడని చెప్పెడివారు. మామగారు ఉద్యుక్తులై జమీన్ కేసు, విజయనగరము పిఠాపురము మున్నగు సంస్థానకేసులలో పనిచేయుచున్నప్పుడు శ్రీమాన్‌గారుకూడ మామగారికి జూనియరుగా అతిశ్రద్ధతో పనిజేసెడివారు. కాని కొంతకాలమునకు జూనియరుగా నుండుటమాని స్వేచ్ఛగా కేసులవాదించుటకే ప్రారంభించిరి. ఆమీఁద కొంతకాలము శ్రీవి. కృష్ణస్వామిఅయ్యరుగారితో కొన్ని గొప్పకేసులలో పనిచేసిరి.

అప్పట్లో శ్రీ పి. ఆర్. సుందరయ్యరు శ్రీవి. కృష్ణ స్వామిఅయ్యరులు మదరాసు హైకోర్టున ప్రబల సీనియరు వకీళ్లుగా నుండిరి. శ్రీమాన్ గారి భార్యపై భాష్యంఅయ్యంగారికి అభిమానము హెచ్చుగ నున్నందుచే నామె ఎదికోరినను భాష్యం అయ్యంగారు లేదనరైరి. ఉత్తములై జమీన్ కేసులో వాదిప్రతివాదు లిద్దఱును, శ్రీభాష్యం అయ్యంగారే కేసులునడపవలెనని తొందరబెట్టిరి. కాని భాష్యమయ్యంగారునకు దిక్కుతోచకయున్న స్థితిలో ఉత్తములై జమీన్ వారిణి శ్రీమాన్ గారి భార్య వద్దకు వచ్చి తమవైపు హైకోర్టున శ్రీభాష్యం అయ్యంగారు వాదింపవలెనని ప్రార్థేయపడెను. శ్రీమాన్ గారిభార్య ప్రోద్బలముకల్ల ఆమె కోరి కను సఫలముచేయుచు ఈకేసున కొన్నిరోజులు హైకోర్టున వాదించి జయ మొందిరి.

శ్రీభాష్యంఅయ్యంగారు రెండు గుఱ్ఱములబండిలో శ్రీమాన్ గారింటివద్దకు వెళ్లి వారికుమారుని కుమా ర్తెనుసముద్రపుటొడ్డునకు తీసికొనివెళ్లెడివారు. మార్గ మున తినుటకు ఏదైన వీరి కిచ్చెడివారు. బాల్యమున శ్రీమాన్ కుమార్తె అంబుజమ్మాళ్ మాటకారి యని కొందఱు తలచెడివారు. తాతగారగు భాష్యం అయ్యంగారి బంగళాకు ఒకప్పుడు వెళ్లినప్పుడుతన

అవ్వాసు చూచుచు తలవెండ్రుకలు తెల్లవారిన మీదట నగలెందుకు ధరించుచున్నావని ప్రశ్నించి నందుకు తాతగారగు భాష్యంఅయ్యంగారు నవ్వుచు నీనగ లన్నింటిని మూలపడవేయవలయునని చెప్పిన మీదట చుట్టుప్రక్కల నున్నవారందరు నవ్విరట. 1908 సం॥న సర్.వి.భాష్యంఅయ్యంగారు మరణించిరి.

మదరాసు హైకోర్టున సీనియరు వకీలుగా నుండిన శ్రీవి. కృష్ణస్వామిఅయ్యరుగారు రాష్ట్ర గవర్నరు నిర్వాహక సభాసభ్యులుగ నియమింపబడిరి. శ్రీపి. ఆర్. సుందరయ్యరుగారు హైకోర్టు జడ్జిపదవిని అధిష్ఠించిరి. అప్పుడు శ్రీమాన్ ఎస్. శ్రీనివాసఅయ్యంగారు మదరాసు హైకోర్టున ప్రబలసీనియరు వకీలుగ పరిగణింపబడిరి. వీరితోం బాటు శ్రీకె. శ్రీనివాసఅయ్యంగారు కూడ పైకి రాగలిగిరి కావున వీ రుభయులు గొప్పకేసులలో న్యాయవాదులుగ వ్యవహరించెడివారు.

1909 సం॥ఏప్రెలున భారతరాజ్యాంగ సంస్కరణల గూర్చిమదరాసు Advocates Association ఒక చక్కనియుపన్యాసము సాగించిరి. ఈ యుపన్యాసము లనుఆమీద పుస్తకరూపమున ప్రచురించిరి. కాలాను సారముగా పరిస్థితులు మారును గావున శాసనము లలో నప్పుడప్పుడు సవరణ లావశ్యకమని వీరు

చెప్పుచుండెడివారు. హిందూధర్మశాస్త్రములలో అనేక సందిగ్ధాంశములు కలవు గావున భారతీయులు పైకి రావలెనన్నచో మతము నిబంధనలపై నాధారపడక స్వేచ్ఛగా శాసనములలో నవసరమైన మార్పుల గావించి తీరవలెనని చెప్పెడివారు. హిందువుల సాంఘిక కట్టుదిట్టములతోగాని మతసంబంధమైన ఏర్పాట్లతోగాని బ్రిటిషు ప్రభుత్వ మేలాటి సంబంధము కలిగించుకొనదని వెల్లడించినందుచే భారతీయుల పురోభివృద్ధికి అంతరాయము కలిగెనని శ్రీమాన్ అభిప్రాయపడెడివారు.

మైలాపూరు పలాతోపు ఇంటిలో 6 సం|| శ్రీమాన్ కాపుర ముండిరి. వీరు న్యాయవాదవృత్తిలో ప్రాముఖ్యత సంపాదింపఁగనే, ఉత్తరమాడవీధిలోనున్న మామగారియింటిలో వాసమేర్పఱచుకొనిరి. వీరి భార్యకు చదువు తక్కువ యయినను అనేక అరవపుస్తకముల నింటిలో చదివి యందు కొంత పాండిత్యమును సంపాదింపఁగల్గిరి. శ్రీమాన్‌గారి భార్య ఆంగ్లభాషా పరిచయము కలిగియుండవలెనని తలచి ఒక ఆంగ్ల ఉపాధ్యాయుని నియమించి మాట్లాడుటకు చక్కఁగ చదువుటకును, చదివి యర్థముచేసికొనుటకును, ఏర్పాట్లు గావించిరి. ఆరోజులలో కుటుంబముతో కూనూరునకో, ఉదకమండలమునకో వేసవి సెలవు

లలో శ్రీశ్రీమాన్‌గారు వెళ్లుచుండెడివారు. కొంత కాల మున్నతప్రదేశమున వాసమున్నందుచే ఆరోగ్యము చక్కపడునని యితరులవలెనె వీరు భావించెడి వారు. కొంతకాలమునకు కోడైకెనాలులోని 'శ్రీ నికేతనం బంగళాన' వాసముండుట వీరికి సంతృప్తి కలిగించుచుండెను. ఏటేట ఈ బంగాళాలోని కొన్ని గదుల చక్కజేయించుటయు, బంగాళా వెంబడిచుట్టు బ్రహ్మాండమైన తోటవేయించుటయు వీరికి వేసవి సెలవులలో కాలముగడపుమార్గముగ కనఁబడెను. చిన్నఅంశములనుగూడ పనివాండ్రతో కలిసి చర్చించి పనుల నిర్వహించు చుండెడివారు. ఆఖరుదశలో కోడైకెనాలులోనే కాలము గడుపవలెనని వీరు చెప్పెడివారు. శ్రీ నికేతనపుబంగళా చుట్టుప్రక్కలలో చలిహెచ్చు గావున దీనికన్న కొంత క్రింద నున్న పెరుమాళ్‌మలై యనుచోట మఱొక బంగళాను నిర్మించుకొనిరి. వీరి బాల్యస్నేహితులు మధురవాసులునగు శ్రీ కె. ఎస్. అయ్యావయర్, శ్రీ సీతారామయ్యర్, మైలాపూరునందలి శ్రీ వి. సి. శేషాచారి, శ్రీ జీవాజీరావు మున్నగు వకీళ్లు వీరి యింటి కప్పుడప్పుడు వచ్చుచుండెడివారు. దాడ్ ఫీడ్ సుబ్రహ్మణ్య అయ్యరుగారు శ్రీమాన్‌గారింటిలో పలుమారు సమావేశమై పేకాట ఆడెడి

వారు. వీరందఱికిని శ్రీమార్గారిభార్య వేడికాఫీ పంపెడివారు. ఆరోజులలో శ్రీమార్గారు గుఱ్ఱపుబండిమీద కోర్టుకు వెళ్లెడివారు. కోర్టునుండిరాగానే దుస్తుల మార్చుకొని మైలాపూరి క్లబ్బునకువెళ్లి అచ్చట Billiardsఆట ఆడెడివారు. క్లబ్ నుండి రాత్రి 9గం॥కు ఇంటికి వచ్చెడివారు. ఆరోజులలో ఎలక్ట్రిక్ దీపములు, మోటారుకారులు ఒకటిరెండు మాత్రమే మదరాసున కనబడుచుండెడివి. కావున కాలినడక మీదనే క్లబ్బునకు వెళ్లెడివారు. రాత్రి వీరిని ఇంటికి పిలుచుకొనివచ్చుటకు లాంతరుతో ఒక జమానును వీరిభార్య క్లబ్ నకు పంపుచుండెను. శ్రీమార్గారికి అరవమునందేగాక తండ్రివలెనే సంస్కృతమునందు గూడ పరిచయముండెను. కావున నప్పుడప్పుడు బాల్యమునందువలెనే అరవపుస్తకములనేగాక వ్యాఖ్యానము, టీకయున్న సంస్కృతలు గ్రంథములనుకూడ చదివెడివారు. వైదికులు, పండితులు వీరిని సమీపించినపుడు వారు సంభాషించు సంస్కృతభాషలోగాని, వారుదహరించు శ్లోకములందుగాని లోపము లున్నచో వెంటనే వాని సవరించెడివారు.

ఆంగ్లవిద్యలో నారితేరిన మనప్రముఖులనేకులు ఫ్రెంచిభాష నేర్చుకొనెడువారు గావున వీరును నొకఫ్రెంచి యధ్యాపకునివద్ద ఫ్రెంచిభాషనేర్చుకొని

యామీద నాభాషలోని యుద్గ్రంథములను రాత్రు లలో చదివెడివారు. బాల్యమున నాంగ్లకవిత్వము చెప్పుటకు వీరుయత్నించిరని వీరి స్వహస్తముతో వ్రాసియుంచిన కొన్ని కాగితములవల్ల తెలియుచున్నది. కాని వీనినన్నిటిని వీరు మరణించుటకు ముందు చింపివారవైచిరి. వీరికి కళలయం దభిమానము సున్న. సంగీతకచ్చేరిలకుగాని, నాటకములకుగాని, సినిమాలకుగాని వీరు వెళ్లెడువారుకారు. ఇంటిలోని వారిని వీనికి వెళ్లరాదని చెప్పెడివారు. ఎన్నడైన వీరి కుటుంబీకులు రాత్రి ఏదైన సినిమాకో, నాటకమునకో వెళ్లినచో;నిద్రమాని కేకలు వేయుచు బంగళా వసారాన నిటునటుతిరుగుచు నిద్రమాని యింకను ఇంటివారు రాలేదేయని నౌకరులతో మొఱ బెట్టుచుండెడివారు. శ్రీమాణ్గారి కుమారుడు, కుమార్తె రాత్రులలో బయటికివెళ్లినపుడు భార్యను బాధపెట్టెడివారు కావున అందఱును బయటికి వెళ్లుట మానవలసివచ్చెను.

వీరు మైలాపూరు ఉత్తరమాడవీధిలో నున్న పుడు వకీలువృత్తిలో అపారధనమును సంపాదించు చుండిరి. వీరివద్ద ననేకులు అప్రెంటీసులుగానుండి గొప్ప న్యాయవాదులగుటయే గాక ప్రజాసేవలో ప్రాముఖ్యతకువచ్చిరి. రావుబహదూర్ కే. వి.

కృష్ణస్వామిఅయ్యరు, శ్రీసుందరరాజఅయ్యంగారు, శ్రీ కే. భాష్యంగారు, శ్రీ గణేశఅయ్యరుగారు, శ్రీ సంపత్కుమారఅయ్యంగారు, శ్రీ ఎస్. వి. నారాయణఅయ్యరు మున్నగువారు వీరివద్ద అప్రెంటీసులుగానుండిరి. మొట్టమొదట అప్రెంటీసుగాచేరి ఆమీాద చాలకాలము వీరి జూనియరువకీలుగానుండిన శ్రీ కే. రాజాఅయ్యరుగారు క్రమేణ గొప్పవకీలై అడ్వకేటుజనరల్ పదవిని సంపాదింపగల్గిరి.

ఒరిజనలుసైడున వకీలుగా నెలకు ఏడెనిమిదివేలు గడించుచు హైకోర్టు జడ్జిపదవి యధిష్ఠింపనున్న శ్రీ ఎస్. దొరస్వామిఅయ్యరుగారు అన్నిటిని త్యజించి పుదుచ్చేరియందలి శ్రీ అరవిందాశ్రమము చేరిరి. శ్రీమాన్ వద్ద అప్రెంటీసుగానున్న శ్రీ దొరస్వామిఅయ్యరుగారు (సంగీతవిద్వాంసులు) ముత్యాలపేట శ్రీ త్యాగయ్యగారి మనుమలు గావున సర్వమును పరిత్యజించుటలో ఆశ్చర్యములేదు. కాని వీరి యీ వర్తన శ్రీమాన్ గారికి మాత్రము మనస్కరించినదికాదు.

చెట్టినాడునుండి, మధుర రామనాథపురజిల్లాలనుండి కేసులపట్టుకొని నాటుకోటశెట్లు వారి గుమాస్తాలు, వారి ఏజంట్లు శ్రీమాన్ గారివద్దకువచ్చినప్పుడు వారందరు శ్రీమాన్ బంగళావద్దనే బసచేసెడి

వారు. కేసు జయమొందునని తనకుతోచునట్టి కేసునే వీరు చేపట్టెడివారు. కేసున సాక్ష్యములే దనియు, ఈ కేసు తప్పక త్రోసివేయఁబడుననియు కక్షిదారులతో చెప్పి అపీలుగావించి వృథాగా డబ్బు ఖర్చుపెట్టవలదని సలహా చెప్పెడివారు. వీరైతే ప్రతి వ్యవహారము రాజీగావించుటయే మేలని అనేక సందర్భములలో కక్షిదారులకు సలహా చెప్పెడివారే కాని, ఏపాడు కేసునైనా దాఖలుచేసి ఒకద్రవ్యమే నార్జింపవలెననెటి నీచము శ్రీమాన్‌కు ఉండెడిది కాదు. ఒకప్పుడు ఒక శ్రీమంతుడు తనకేసును శ్రీమాన్ పుచ్చుకొని అపీలు దాఖలుచేసి నడపవలెనని నిర్బంధపఱచెను. శ్రీమాన్ మాత్రము అపీలు చేయుటవలన లాభముండదని నిష్కర్ష జేసుకొని నెంతచెప్పినను వినక శ్రీమాన్‌గారపీలు దాఖలుచేయ కున్నచో ఆకక్షిదారుఁడు తనయూరులో నేఱడుగు బెట్టక పైలోకమునకు వెళ్లవలసినదితప్పగత్యంతరము లేదని మొఱపెట్టెను. సముద్రమునందుపడి ప్రాణ త్యాగము తప్పక చేసికొందునని నాకక్షిదారుఁడు చెప్పగా, అతని దగ్గఱకుపిలచి మిత్రులుకొందరు నీకేసున అపీలు దాఖలుచేయుమని చెప్పుచున్నారు. నీవున్నూ ప్రోత్సహించుచున్నావు. కాని అపీలు

దాఖలుచేసినను నీకేసునెగ్గదని నిష్కర్షగ ముందే చెప్పిరి. అట్లనే జరిగెను.

పిఠాపురము, వెంకటగిరి, విజయనగరము, నూజివీడు మున్నగు సంస్థానముల కేసు లనేకముల శ్రీవారు చేపట్టిరి. అహోబిలము, తిరుపనందాళ మున్నగు మఠముల కేసులలోగూడ వీరే సీనియరు వకీలుగ వాదించెడివారు. పై మఠముల కేసులలో కొన్నింటిలో ఫీజునే పుచ్చుకొనక మైఖాకోర్టున వాదించెడివారు. పలుమారు బైటికోర్టులకు వెళ్ల వలసి యున్నందుచే కస్తూరియనే పేరుగల వంటవాని వెంటఁబెట్టుకొని అన్నిచోట్లకు వెళ్లెడివారు. సకాలమున చక్కగ నప్పటికప్పటికి వేడిగ సిద్ధము గావించిన నాహారములనేతప్ప మఱి నింకొకదానిని పుచ్చుకొనెడివారే కారు.

ఏకోర్టునగానీ వీరు వాదించునప్పుడు చుట్టు ప్రక్కల ఏవందలకొలదో జనము గుమిగూడుట సర్వసాధారణముగ నుండగా, జడ్జీలుగూడ వీరి మాటల చాల శ్రద్ధతో వినుచు ఎంతో మెలకువతో వర్తించెడివారు. వీరి ననుసరించి ఉంటూన్న వంటవాడు కస్తూరియు, గుమాస్తా శ్రీరామచంద్రుఁడును ఇంటికివచ్చినదే ఆనాడు కోర్టునజరిగిన వృత్తాంతముల నన్నిటిని, ఇంటివారికి చెప్పెడివారు.

1910 సం॥ శ్రీమాన్‌గారు లజ్ రోడ్డునందలి "అంజాద్ బాగ్ బంగళాను కొనిరి. అప్పటికి వీరి మామగారు సర్. శ్రీ వి. భాష్యంఅయ్యంగారు మరణించి రెండు సంవత్సరములాయెను. 1911-వ సం॥ కొత్తబంగళాకు శ్రీమాన్ వచ్చిచేరిరి. 1910 సంవత్సరమున కుమార్తెకు వివాహమత్యంతవైభవముగ జరిపిరి. వివాహముహూర్తము మధ్యాహ్నము 12 గంటలకు నిర్ణయింపఁబడెను. కాని 10 గంటలకు కాబోలు అల్లుఁడు వారియెదుట నిలఁబడియుండగనే కూతురుని భార్యను దగ్గఱనుంచుకొని గంటసేపు భార్యాభర్తల విధులఁగూర్చిన సమస్తమును బోధించు చుండగా, నీలోపుగనే నౌకరులు, వంటవారు ఇంటి యజమాని మొదలైనవారు కనఁబడనందున ఎచ్చటికి వెళ్లిరో తెలియక తహతహపడిరి.

శ్రీమాన్‌గారు ఏవిషయమునుగూర్చి మాట్లాడుటకు ప్రారంభించినను సరే ఏపనిచేయుటకు ప్రారంభించినను సరే అది ముగియువరకు వారిమనస్సు దాని యందే నిమగ్నమైయుండును. ఒక గుమాస్తాలు గాదు, ఒక నౌకరులుగాదు, తన భార్యగాదు, తన పిల్లలుగాదు, శ్రీమంతులైన కక్షిదారులుగాదు, మహారాజులుగాదు అందరును అంతవరకు కాచు

కొని యొకమూల ఒదిగిపడి యుండవలసినదే! వీరు తాచేపట్టిన వ్యవహారమునవో తన ఆలోచనల తెరపి పడిన అంశముఁలందో తదేకధ్యానమునిల్పి యోగులు సమాధిస్థితులైనట్లు తాదాత్మ్యతనొంది తన పరిసరముల నుండివేరై అదేదో మరొక ప్రపంచమున నున్న నొకానొక సిద్ధునిరీతి యోగానుభూతిలో విలీనుడై యుండ మరి గత్యంతర మేమున్నది? ... ఆసమయ ముల వీరిదోరణినిగాని, వీరి ధ్యానమునుగాని వీరుం టున్న దశానుభూతులగాని; నీవైపున్న నెంతటి తల పోవుసందర్భములుగాని నేప్రాపంచిక ఆశాపాశములు గాని వీరిదృష్టి నాకర్షించ జాలనందున వీరున్నస్థితినే రూపుకదలక ఉందురు: అనగా, వీరిని ఆసమయములల నెవరున్నా సమీపించి వీరి ధ్యానధారణముల భంగ పఱచరు. ఎవరున్నా సాహసించరు. ఎవరు సాహ సింతురు? అందరకు అంతఃజ్వరమే. వీరికై, లక్షలు, లక్షలు ధనపుసంచులతో ఒకరివెనుక నొకొ్కక్కరుగ జమీాన్దారులు, శ్రీమంతులు క్యూలో నిలచి నిలచి కాళ్లతీపులతో, మనస్సుల విసుగు, కేసు లేమగునో అను తహ తహలతో, వీరింట ఏమిచేయను దిక్కుతోచక దేవుడా! యని పడి ఉండవలసినదే, ఎంతకాలమైనను శ్రీవారి దయ వెట్టువరకు ద్వారబంధపుసేవ జేయుచుండవల

సినదే ! వీ రాసమయములు చేయుచుండునది యే మనగా: ఒక కానీకి కొఱగాని నేలవ్యక్త వ్యక్తితోనో లేదా, ఒక 0-4-0 స్వచ్ఛంద కాంగ్రెసుసేవకునితోనో తోటలో పచారుచేయుచు దేశవిషయములను చర్చించుచుండవలసినదే. నీవైపున్న ప్రపంచము తగులబడిననుసరే, ప్రళయమేవచ్చి తన కొంపమునిగి ననుసరే, కేసులు కక్షిదారులు తన్ను వదులుకొనిపోయి ననుసరే, ఏది ఏమైనను వీరంతే. వీరికేదిన్నీ నేవిధమైన యోగభంగమును చేయవు. వీరి నెవరుగాని నెదు రెదురుగా సమీపించ భయపడువారు. వారి ప్రకృతి అంత రెరిగియే యుండిరి. ఆప్రకృతికి అందరు జడి యుచు నెప్పుడెప్పుడే ప్రళయమూడిపడునో ! ఏమి జేసిననేమో! అని దిగ్భ్రమజెందియుందురు. ఆదోరణి లోని ఆ అనర్ఘలవాహిని కెదురీద నెవరికిన్నీ గుండె లేక తమకున్న కోపాదులనన్నిటి నడచుకొని శ్రీమాఁవారి సలహా లెప్పు డెప్పుడా అని తపస్సు జేయుచు — దేవుడివరమునుకోరి వ్రతము — జేయు ఆ వారికి శ్రీమాఁగారి క్రీగంటిజూపుతో పడిన అన్ని బాధలు సమసిపోవుచుండినవి. వీరితో నొకగుపలుకపుకాని అందరిని వీరు పలుకరించు వారు. ఒకరిని వీరు పిలవవలసినదే గాని ఒకరికివీరు

సలహా చెప్పవలసినదే గాని మరెవరు వీరిని పిలవ లేరు, సాహసించికూడ వీరికి సలహాల జెప్పరు.

రైలు ప్రయాణము సాగించునపుడు వీ రెవరితో నైనను మాట్లాడుచున్నచో టైము ప్రకారము నడవవలసిన రైలుగూడ కొంతసేపు ఆగవలసియుం డును. ఒకతూరి ఉదకమండలమునకు వెళ్లుటకు మేట్టు పాళెము రైలులో కూనూరునకు ప్రయాణమై. రెండవక్లాసుపెట్టె నంతను తనకే రిజర్వు చేసికొని యుండిరి. ఒక ఐరోపియను వీరిపెట్టెలోనికివచ్చి కూర్చుండెను. అది శ్రీమాను జూచిరి. మన జాతీయ పోరాటముల ప్రధానభూమికరై ఐరోపియనుల పరి పాలనలో ఉంటున్న క్లిష్టపరిస్థితులలోని దేశీయవ్యవ హారములలోనున్న వివిధసమస్యలను చక్కగ నెరిగి యున్న శ్రీమానులో జాతీయత ఒక్కపెట్టున విజృం బించగా నొక తుపానురేగెను. శ్రీమాను అతనిని తనపెట్టెదిగమని ఎంతజెప్పినను అతడు వినలేదు. అంత శ్రీమాను గార్డును పిలిపించెను. ఆతని తన పెట్టెనుండి దింపి రైలు నడపమనిరి. తన పరువుప్రతిష్టలకే దెబ్బ తగిలెననుకొనెనో, ఏమో. నేను చెప్పలేనుగాని, ఆ మూర్ఖుడుమాత్రము ఎవరిమాటలను వినలేదు. గార్డు నయముగజెప్పినను వినడు. మందలించినను వినడు. దిగడు. అపుడు చేయునదిలేక గార్డు ప్రక్కస్టేషనులో

పూర్తిపెట్టెను శ్రీమాన్‌గారికిప్పించెదనని ప్రార్థేయ పడెను. అంత శ్రీమాన్ ఆగ్రహముచెంది స్టేషన్ మాస్టరును రప్పించి యతనిద్వారా నాఐరోపియన్‌కు సలహా చెప్పించి యతనిని దింపి మరొకపెట్టె కెక్కించు నట్లు జేసిరి. ఆమీదనే శ్రీమాన్‌గారు తమపెట్టెలో ప్రవేశించి నిమ్మళముగ కూర్చుండిరి. ఆవెనుకనే బండి కదలినది. ఇట్టి సంభవము లనేకము లప్పు డప్పుడు తటస్థించెడివి.

ఎచ్చటికివెళ్లినను తనయిష్టప్రకారము అన్నియు సాగవలెనేకాని "పోనీ యింకొకమారు చూచు కొనవచ్చునని తలచెడువారుకారు. వీరితో ననేక దూరప్రదేశములకు నేను ప్రయాణముచేసితిని. కావున కొన్నివేళలలో నావంటివారికి రాజోప చారముల చేయుమని వంటమనిషి కస్తూరితో చెప్పెడివారు. నాకు పడిసెమో, తలనొప్పియో ఏదైనా గలిగినప్పుడు వెంటనే డాక్టరువద్దకుం బంపి మందుపుచ్చుకొనుమని ప్రోత్సాహపఱచెడివారు. ఇంటగానీ బయటగానీ ఏయూరిలో నేదోబసలోగాని వీరున్నచో ఏచంచమందో ఆచోటనున్నట్లు కనం బడును. వీరు మైకివెళ్లినచో ఏసంచడి వినరాదు.

Luz Church Road. పడమటివైపు చర్చియుం టున్నది. దీనిని మైలాపూరువాసులు 'అడవిగుడి' యని

చెప్పుదురు. బుడతకీచులు మొట్టమొదట ఇండియాకు వచ్చినప్పుడు వారియోడ మదరాసుతీరమున నాగి యుండెను. అప్పుడు తీవ్రమైన గాలి తుపానువల్ల సముద్రపుఅలలు పర్వతాకారముగ పైలావుకు లోపలికివచ్చుటకు ప్రారంభించెను. ఓడలనడపువారు సెయింట్ మేరీకి ప్రార్థనలు సలుపుచూ నిటునటుగా ఊగుచుండినయోడలోనుండిరి. ఏయాపద లేక పోయినచో మేరీపేర యొకచర్చిని నిర్మింతుమని ప్రార్థనగావించుకొనిరి. దేవునిదయవల్ల ఉదయము కాగానే Santhome Church ఓడలో నున్న వారికి కనఁబడినమీాదట ఓడదిగిగట్టుచేరిరి. ఆపడమటి తట్టు ఒకజ్యోతికనఁబడి యదృశ్యమాయెను. కావున ఆచోట బుడతకీచులు పైఁజెప్పిన 'అడవిగుడిని' నిర్మించిరి. శ్రీమార్గాగారు 'అంజద్ బాగ్' బంగాళాన వాసమేర్పఱచుకొన్నప్పుడు ఎదుటనున్న ప్రదేశము ఒకచిన్నయడవిగా కనఁబడుచుండెను. ఎటుజూచినను సీమచింతచెట్లును, అత్తి, మఱ్ఱి, రావిచెట్లును, కప్పలును విశేషముగా నుండెను. కొన్నిప్రదేశము లలో వెదురుపొదలు కనఁబడుచుండెను 'అంజాద్ బాగ్' ఆవరణమున గురిగింజచెట్టు, రెండుమూడు గంధపుచెట్లు ఉంటూయుండెను. రాత్రిరోడ్డు జన సంచారములేక నిశ్శబ్దముగ నుండును. చీకటిపడగానే

యింటినుండి బయటికివెళ్లుటకు స్త్రీలు, పిల్లలు భయపడెడివారు. శ్రీమాన్‌గారి తోటలో పాము లనేకములుండెను గావున పారానౌకర్లకు రాత్రులలో వీనిని చంపుటతప్ప వేరొకపని యుండెడిదికాదు. వర్షాకాలమున కప్పలకూతలు హెచ్చుగనుండెడివి. అయితే లజ్ రోడ్డునకు అప్పుడేగాక యిప్పుడుగూడ నొకమోస్తరు ప్రాముఖ్యత యేర్పడియున్నది. ప్రముఖులును అపారధనవంతులును ఈరోడ్డునందే వసించెడివారు. రాజా. సర్. టి. మాధవరావు, సర్. శ్రీ వి. భాష్యంఅయ్యంగారు, Dary house (ప్యారీకంపెని) శ్రీ వేంకటస్వామినాయుడుగారు శ్రీ వి. కృష్ణస్వామిఅయ్యరు మున్నగువారందరును ఈరోడ్డునందలి బంగాళాలలో వసించెడివారు. పైప్రముఖులేగాక, బరోడా, తిరువాన్కూరు, సంస్థానముల దివానులు దివాన్‌బహద్దరు శ్రీ. ఎస్. శ్రీనివాసరాఘవఅయ్యంగారు, సుప్రసిద్ధబారిస్టరు, శ్రీ నార్టన్ మహాశయులు, సర్. శ్రీ వి. టి. దేశికాచారి. శ్రీ. ఎస్. సుబ్రహ్మణ్యయ్యరు మున్నగు ప్రముఖులందరును లజ్ రోడ్డున వాసముండిరి. లజ్ చర్చిరోడ్డు బంగలాలతో ఐరోపనియను లే వసించుచుండిరి. కాని గడచిన, 70, 80, సంllగా చెన్నపురివాసులు ఈబంగాళాలకొని వీనియందు

నివాసమేర్పఱచుకొనిరి. అడ్వకేటు జనరల్ పదవిలో నున్నపుడు సర్. శ్రీ పి. యస్. శివస్వామి అయ్యరు గారు లజ్ రోడ్డునందే వసించుచుండిరి. ఆమీఁద శ్రీ టి. ఆర్. వేంకటరామశాస్త్రి, సర్. శ్రీ కె. శ్రీనివాసఅయ్యంగారు ఈరోడ్డునందలి బంగాళా లలో వాసముచేయుచు హైకోర్టున న్యాయవాదు లలో ప్రముఖులుగ నుండిరి. శ్రీమాఁగారు మైలా పూరు వకీళ్లలో నగ్రస్థానము సంపాదింపగల్గిరని యిదివరలో చెప్పియుంటిని. శ్రీమాఁగారి సోద రుఁడు శ్రీ. యస్. వెంకటేశఅయ్యంగారు, సర్. కె. శ్రీనివాసఅయ్యంగారి అల్లుఁడాయెను. సర్. కె. శ్రీనివాసఅయ్యంగారు గవర్నరు కౌన్సిలుమెంబరు కాగానే సర్. శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారు లజ్ చర్చిరోడ్డున నొకబంగళా నిర్మించుకొని అందుఁ జేరిరి. లజ్ చర్చిరోడ్డున ఎందరో ప్రముఖులు వాసమున్నందుచే అనేకులు పనులమీఁద ఈప్రదేశ మునకు వచ్చెడివారు. ఒకరివెంబడి ఒకరు అడ్వొకేటు జనరల్ పదవిని స్వీకరించిరి కావున (సర్. శ్రీ వి. భాష్యంఅయ్యంగారు, శ్రీమాఁ ఎస్. శ్రీనివాస అయ్యంగారు. సర్. శ్రీ కె. శ్రీనివాసఅయ్యంగారు) ఈరోడ్డుప్రాముఖ్యత రానురాను అతిశయించెను.

బరోడా సంస్థానదివాను దివాన్ బహదూర్ శ్రీ ఎస్. శ్రీనివాసరాఘవయ్యంగారు, బరోడాకు మొదట దివాన్ ఆమీాద తిరువాన్కూరు సంస్థాన దివానుగ నుండిన సర్. శ్రీ టి. మాధవరావుగారు, మద్రాసు హైకోర్టు ప్రధానన్యాయమూర్తి సర్. శ్రీ ఎస్. సుబ్రహ్మణ్యఅయ్యరే గాక మరినాల్గున్యాయ మూర్తులు, సర్. శ్రీ వీ. భాష్యంఅయ్యంగారు. శ్రీ వి. కృష్ణస్వామిఅయ్యరు శ్రీ పి. ఆర్. సుంద రయ్యరు, సర్. శ్రీ కె. శ్రీనివాసయ్యంగారు ఆరోడ్డులో వసించుచుండిరి. అంజద్ బాగ్ బంగళాను శ్రీమాన్‌గారు 10 వేలకుకొనిరి; ఆమీాద 20 వేలు ఖర్చుపెట్టి దీనిని నూతనబంగళాగ మార్చిరి. ఈబంగళా పూర్వము డిసిల్వాగారి దనియు అనేక చేతులు మారి చివరకు ఒకమహమ్మ దీయస్త్రీకి వశమాయెననియు ఈమె యొక్క మొద లారికి విక్రయింపగా వారివద్దనుండి శ్రీమాన్‌గారు కొన్నారనియు తెలియుచున్నది. ఇందు ప్రవేశించిన మీాదట శ్రీమాన్‌గారి ఆదాయము హెచ్చి నెలకు 10,000 పైగా సంపాదింపగల్గిరి, కావున కుటుంబము వారందఱును సంపన్నులై తమ జీవితమును ఉన్నత స్థాయిలో గడప వీలాయెను.

శ్రీమార్కుగారు ఏటాదుస్తులకై వేయిరూపాయలు ఖర్చుపెట్టెడివారు. ఉదయము నిత్యకృత్యముల నిర్వహించుకొని ఆఫీసుగదిలో కేసులను, కక్షిదారుల సమక్షమున చదివెడువారు. ౧౫౦॥ కాగానే డ్రాయింగుహాలునకువచ్చి కచ్చేరి సాగించెడివారు. ఈలోగా వంటమనిషి వెండిగిన్నెలో మోరు అన్నము పులుసుఅన్నము అప్పడములు, వడియములు, ఊరగాయలు మున్నగువాని సిద్ధముగావించుకొని ఎదుట నిలబడియుండును. ఒకచేతిలో కోటు తగిలించుకొని మఱొకచేతితో వంటవాఁడు అందిచ్చు గిన్నెలలోని అన్నమును నిలచుకొని భుజించెడివారు. ఈలోగా అప్రెంటీసులలో ఎవరైన ఒకరు పాగా చుట్టి తెచ్చియిచ్చుటయు, భార్య నెక్టై తగిలించుటయు నౌకరిబూట్సును కాళ్లకు తొడుగుటయు, ఆమీాద వీరు కోర్టుకు ప్రయాణమగుటయు జరిగెడిది. వీరు కోర్టుకు వెళ్లులోపలనే ఒక ఝడివాన కురిసి నిలచినట్లే యింటివారందఱు భావింతురు. నల్కాదుస్తులధరించు శ్రీమార్కుగారు శ్రీగాంధీతో సంబంధము ఏర్పడినమీాదట, పూర్వము ధరించుచుండిన దుస్తులపై వ్యామోహము వదలిరేమో, యని యింటివారేగాక పైవారు కొందఱును భావించిరి గాని యట్లు గావింపరైరి.

నెలకు 10 వేలకుపైగా ఆర్జన యున్నప్పుడు గూడ డబ్బుండెడి పెట్టెవద్దకు వెళ్లువారుకారు. పెట్టెతాళపుచెవిని, జమాఖర్చు లెక్కలచూచు అల వాటు వీరికి గలవడలేదు. కుటుంబ ఖర్చులన్నియు వీరి భార్యగారే నిర్వహించుచు, గుమాస్తా సహాయ మున లెక్కల వ్రాయించుచుండిరి. శ్రీమాన్‌గారికి తన భార్యసొమ్ము వృథాగా ఖర్చుపెట్టదను నమ్మక ముండెను కావునను, లెక్కల చూచుటలో లోప ముండదని నమ్మువారు కావున కుమారుడు కుమార్తె యాతీరున తల్లివలె వ్యవహరింప నేర్చు కొనవలెనని చెప్పుచు పుస్తకములు చదువుటవలన నీప్రతిభ రాదని చెప్పెడివారు. వీరి యుదారబుద్ధి వల్ల లాభము చెందినవారు అనేకులు గావున వీరు శ్రీమాన్‌చేసిన సహాయమునుగూర్చి మదరాసు యూనివర్సిటీన బి. ఏ. పరీక్షలో అగ్రస్థానము వహించిన విద్యార్థికి ఒక బంగారుపతకమును' తన మామగారగు శ్రీ సర్. వి. భాష్యంఅయ్యంగారి పేర ప్రతిసంవత్సరము ఇచ్చుటకై 5 వేలు ఇచ్చిరి. పండిత శ్రీమదనమోహనమాలవ్యాగారు ప్రారంభించిన కాశీ విశ్వవిద్యాలయమునకు 10 వే లిచ్చిరి. శ్రీగోపాల కృష్ణగోఖలేగారిపేర ప్రతిసంవత్సరము మదరాసు

యూనివర్సిటీస ఆర్థికశాస్త్రమునుగూర్చి ప్రముఖు లుపన్యసించుటకై 10 వేలు యూనిర్సిటీకి కిచ్చిరి. శ్రీగాంధీగారు కాంగ్రెసు ప్రచారము ప్రారంభించి వీరి సహాయమునుకోరగా 10 వేలు విరాళముగ నిచ్చిరి. ఈపెద్ద మొత్తములు ఇంటివారికి తెలియునే కాని చిల్లర మొత్తములు ఎవరెవరికి ఎప్పుడు ఇచ్చిరో ఎవరికి తెలియదు. రామనాథపురమునందు తాను జన్మించిన యింటిని చక్కజేసి 25 వేలు ఖర్చుపెట్టి ఒకహాలు నిర్మించి యిందు లైబ్రరీని, నాటకశాలను ప్రజోపయోగమునకై నిర్మించిరి. ఇందుకై వీరికుమారులు శ్రీఎస్. పార్థసారథి శ్రీమాక్ మరణించినమీదట కొంతసొమ్ము వెచ్చించి లైబ్రరీని వృద్ధిచేసెను.

ఎచ్చటికైనను ప్రయాణము సాగింపవలసివచ్చి నచో శ్రీమాక్‌గారికి ప్రత్యేకముగ సన్నబియ్యము, నేయి, అప్పడములు, ఊరగాయలు, అన్నపుపొడి మున్నగునన్నిటిని, వంటమనిషినికూడతీసికొని వెళ్లు చుండును. వీరు పైవారు తయారుచేసిన కాఫీని గాని, ఫలహారమునుగాని పుచ్చుకొనెడువారు కారు. కావున వంటమనిషి కస్తూరి వీరికి కావలసిన వన్నిటి కుక్కర్‌పైనో కుంపటిమీదనో సిద్ధము గావించే అలవాటు. బయటినుండి తెప్పింపబడిన

ఫలహారముల త్యజించెడి యలవాటు మామగా రింటిలో వీ రున్నప్పుడు ఏర్పడెను. స్వదేశమున నీ తీరుగ ప్రయాణము సాగించిన శ్రీమాన్ కాంగ్రెసు పనిమీద దూర ప్రదేశములకు వెళ్లినప్పుడుగానీ, విదేశములకు వెళ్లినప్పుడుగానీ తనతో నౌకరి రా నక్కఱలేదని చెప్పుట యందఱికిని ఆశ్చర్యము కలిగించెను. సదా వీరివెంబడి నౌకరియుండవలెనని వీరికి పట్టుదలలేదు. కాంగ్రెసు పనులమీదనే కేసులకై బయటికి వెళ్లినప్పుడును కస్తూరిని తీసికొని వెళ్లుచుండిరి కాని విదేశములకు వెళ్లినప్పుడు ఒంట రిగా వెళ్లిరి. ఆరోజులలో అప్పుడప్పుడు అంజాద్ బాగ్‌లోన గొప్ప టీపార్టీలు సాగుచుండెను. ఇందుకు హాజరకాకం పెనీవారు కంట్రాక్టర్లుగా నుండిరి. కాని గాంధీగారి గౌరవార్థము కావించిన విందుకు హాజరకాకం పెనీవారిని రప్పింపరైరి. వీరి కుటుంబము వారు గవర్నమెంటుహౌసు విందునకు వెళ్లెడివారు. లార్డ్ పెంట్‌లండ్ గవర్నరు భార్యను, శ్రీమాన్‌గారి భార్య 'అంజాద్ బాగున కాహ్వానించి గొప్ప టీపార్టీ నిచ్చిరి. ఈపార్టీకి మహిళలనేకులు హాజరైరి.

శ్రీమాన్‌గారి కుమార్తె శ్రీ అంబుజమ్మాళ్ గారికి విద్యనేర్పుటకై ఒక ఆంగ్లస్త్రీని నియమించిరి. చది వించి నంతమాత్రమున తాను సంతృప్తిచెందననియు,

ఇంటిపనులు, వంట, కుట్టుపనులు నేర్చుకొనవలె ననియు, సంగీతము పాడుటకు కూడ శక్తికలిగి యుండవలెననియు అప్పుడప్పుడు చెప్పుచుండెడు వారు. ఎల్లప్పుడు పుస్తకములు చదువుటమాని యింటిపనుల గమనింపుమని కుమార్తెను హెచ్చరించెడువారు. శ్రీ గాంధీతో సంబంధము ఏర్పడుటకు ముందు శ్రీమాన్ గారివర్తన కుటుంబపరిస్థితులు ఎట్టివో నాకు తెలిసినంతవరకు వివరించితిని గాని నాకు తెలియని అంశములు కొన్ని గలవని చదువరులు గుర్తింపవలెను.

శ్రీగాంధీగారిని శ్రీమాన్ గారు కలసికొనుటకు చాలా సం॥లకు ముందే వారు రాజకీయ సాంఘిక వ్యవహారములలో జోక్యము కలిగించుకొని కొంత కృషి సాగించియుండిరి. ఆరోజులలో న్యాయవాది వృత్తిలోను, ప్రజాసేవయందును అగ్రేసరులైన శ్రీ వి. కృష్ణస్వామిఅయ్యంగారిని ఆదర్శముగ నుంచుకొని శ్రీమాన్ వర్తించుచుండెను. కావుననే శ్రీ కృష్ణస్వామిఅయ్యరు వీరిని ప్రీతితో శ్రీమాన్' అని పిలిచెడివారు. 1908 సం॥న మదరాసున సమావేశమైన కాంగ్రెసుకు డాక్టరు సర్. శ్రీరాష్ బెహారీ ఘోష్ గారికి శ్రీమాన్ గారిని పరిచయముచేయుచు "శ్రీమాన్ శ్రీనివాసఅయ్యంగారు, సర్. వి. భాష్యం

అయ్యంగారిఅల్లుడు, కాని కొన్నిసందర్భములలో వీరివిపై చేయి" అనగా న్యాయవాదివృత్తిలో శ్రీమాణ్ గారి బుద్ధికుశలత అతితీక్ష్ణమైనదని శ్రీ వి. కృష్ణస్వామిఅయ్యరు భావించిరనే పైతీరున పరిచయముచేసిరి.

సాంఘికసంస్కరణలగావింప నేర్పడినసంఘము వారు వీరినితమగోష్ఠిలో చేర్చుకోలేదుగాని కొన్ని సందర్భములలో సంఘసంస్కరణము ఆవశ్యక మనియే వీరుతలచుచు సర్: శ్రీశంకరణ్ నాయరు కక్షలోకలసి కొంతకాలముపాటుపడిరి కావున శ్రీమాణ్ గారిపై సర్: శ్రీశంకరణ్ నాయరుగారికి క్రమేణ అభిమానముహెచ్చెనని తెలియుచున్నది. న్యాయవాదవృత్తిలోనున్నను ప్రజాసేవగావించిన దేశమునకు కొంతమేలు సాగింపవీలగునని ప్రపంచ మునకు వెల్లడించినవారు సర్: శ్రీశంకరణ్ నాయరు గారని శ్రీమాణ్ చెప్పెడివారు. కొంతకాలమునకు శంకరణ్ నాయరుగోష్ఠి మతజాతిభేదములకు ప్రాము ఖ్యతనిచ్చినందుచే నీగోష్ఠితో శ్రీమాణ్ గారు సంబం ధమువదలుకొనిరి.

(శ్రీ మణిఅయ్యరు) జస్టిసు సర్. సుబ్రహ్మణ్య య్యరుపేర్లను ఎవరైన చెప్పినంతమాత్రముననే తన

హృదయాహ్లాదమును శ్రీమాన్ వెలిబుచ్చుచుం డును. వారి గుణాతిశయములు ఉదారబుద్ధి సునిశిత విమర్శనాపటిమమున్నగువాని అప్పుడప్పుడు ప్రశం సించుచు శ్రీ మణిఅయ్యరుకూడ తమవలె మధురవాసి యనెడివారు. మదరాసుయూనివర్శిటీసెనేటునకు పట్టభద్రులచే యెన్నుకోబడి నాలుగుసం॥ల కాలము సెనేటు మెంబరుగ నుండిరి.

1914-వ సం॥ చెన్నపట్టణమున కాంగ్రెసుసమా వేశముజరిగినప్పుడు శ్రీమాన్‌గారు సన్మానసంఘ కార్యదర్శిగ యెన్నుకోబడి అన్నిపనుల చక్కగనిర్వ హించిరి. మరొక కార్యదర్శియగు శ్రీ జి. ఎ. నటే శయ్యరుగారు ఆహ్వానసంఘటిక్కెట్లలో తనపేరు వేసికొనగా శ్రీమాన్‌గారు దీనిగుర్తించి యెవరి పేరు టిక్కెట్లలోనుండరాదనియు ఆహ్వానసంఘా ధ్యక్షులపేరుమాత్రమే ముద్రింపబడవలెననియు, శ్రీ జి. ఎ. నటేశన్‌గారికి నొకజాబువ్రాసి కోర్టుపని మీద మధురకువెళ్లుచు టిక్కెట్టుఫ్రూఫు తానామో దించినమీదనే ముద్రణముకావలెనని తెలియజేసిరి. వీరిష్టప్రకారమే విధిలేక జి. ఎ. నటేశన్‌గారు మధుర నుండి శ్రీమాన్‌రాగానే టిక్కెట్లఫ్రూఫుల కనం బఱచి ఆమీఁద వీని ముద్రింపించెను.

డాక్టరు ఆనిబిసెంటు హోమ్‌రూలు ఉద్యమమును ప్రారంభించినపుడు శ్రీమాణ్ గారు ఆనిబిసెంటు వర్తనను ఆమోదించిరి. కాని, అడ్వొకేటుజనరలుపదవిలోనున్నందువల్లను, అడయారు థియసాఫికల్ సొసైటీ సిద్ధాంతములపై వీరికి నమ్మకము లేనందునను, ఈసొసైటీ రహస్యగోష్ఠులలోని చర్యలను నిరసింపవలసివచ్చినందుచే కొంతకాలమునకు శ్రీ ఆనిబిసెంటుగారికృషికి ఏసహాయముగావింపరైరి. శ్రీ జి. కృష్ణమూర్తిని దత్తునిగా స్వీకరించుటయు ఆమీద కృష్ణమూర్తితండ్రి హైకోర్టుపై దావా వేయుటయు దివ్యజ్ఞానసామాజికులకు సంతృప్తికలిగింపవచ్చునుగాని తనకు ఆనిబిసెంటువర్తన యేమాత్రము గిట్టదనిచెప్పుటకు ప్రారంభించిరి. ఈసమాజమునందు సభ్యులుగనున్న డాక్టరు శ్రీనంజుండరావుగారు శ్రీమాణ్ గారియింటిడాక్టరుగావున్న రోజూ శ్రీమాణ్ గారియింటికివచ్చెడివారు. వచ్చినప్పుడెల్ల శ్రీమాణ్ గారితో థియసాఫికల్ సొసైటీ చర్యలగూర్చిచెప్పెడువారు కావునను శ్రీ ఆనిబిసెంటుపై శ్రీకృష్ణమూర్తిదత్తతనుగూర్చి శ్రీ నంజుండరావుగారు దావా దాఖలుచేయించిరి కావునను థియసాఫికల్ సొసైటీన జరగువృత్తాంతములన్నియు డాక్టరుగారికి చక్కగా

తెలియును గావునను డాక్టరుగార్రి సంభాషణలే శ్రీమార్‌వారికిని శ్రీఆనిబిసెంటునకు అభిప్రాయ భేదము హెచ్చెనని అనేకులు అనుకొనుచుండిరి.

1916 సం॥ శ్రీమార్‌గారు అడ్వకేటుజనరలుపద విని స్వీకరించిరి. ఈపదవికి వీరు మొదట తాత్కా లికముగ నియమింపఁబడి ఆనిరాద దీర్ఘకాలము ఈ పదవిలోనుండుటకు అవకాశమును సంపాదింపగల్గిరి. పదవిభాయము కాగానే కాంగ్రెసు ప్రముఖులును సుప్రసిద్ధజాతీయవాదియునైన హిందూముస్లిం అల్ల ర్లలో శిక్షజెందినవారును భారతదేశమంతటను కీర్తి గడించినవారును అగు శ్రీ సేలము విజయరాఘవా చారిగారు శ్రీమార్‌గారికి అడ్వకేటుజనరలుపదవి లభించినందుకు వీరిని కీర్తించిరి. అప్పట్లో శ్రీ విజయ రాఘవాచారిగారు మదరాసు రాష్ట్రశాసనసభ్యు లుగనుండెడివారు. వీరికి దక్షిణదేశమున పలుకుబడి హెచ్చుగావున క్రమేణ ఢిల్లీఅసెంబ్లీ సభ్యులగు టయేగాక నాగపూరుకాంగ్రెసుసమావేశమునకు అధ్యక్షులుగ యెన్నుకోబడిరి. ఈమహానీయుఁడు సామాన్యులపొగడువాఁడుకాఁడు. శ్రీమార్‌గారు అత్యున్నతవ్యక్తియని గుర్తించియే వీరిని అభినం దించిరి. అప్పట్లో శ్రీమార్‌గారికి హైకోర్టుజడ్జిపదవి

నిత్తురని వార్త బయలుదేరెను కాని, ఆపదవిని స్వీకరించుటకు వీరికిష్టములేదని రాష్ట్రగవర్నరు తెలుసుకొని పైకి తెలియజేసెను. కావున వీరు న్యాయవాదిగనే కాలముగడపిరి. కొన్నిమాసములలో శ్రీమాంటిగారిని రాష్ట్రగవర్నరు కౌన్సిలుమెంబరుగావింతురని యనేకులుఅనుకొనుచుండిరి. వీరికధికారులు C. I. E. అను బిరుదమును యిచ్చిరేకాని కౌన్సిలుపదవిని వీరికేల నివ్వలేదో యెవరికిని తెలిసినదికాదు.

1912 సం॥ వీరు రాజ్యాంగసంస్కరణల మహాసభకు అధ్యక్షులైరి. అడ్వకేటుజనరలు కావున ఆచారప్రకారము వీరు మదరాసురాష్ట్ర శాసనసభ్యులుగనుండి మదరాసుప్రభుత్వమునకు సలహాల నిచ్చుటయేగాక అనధికారసభ్యులు ఎవరైన శాసనసభలో న్యాయసంబంధమైన ప్రభుత్వచర్యల ఆక్షేపించినచో అడ్వకేటుజనరలైన వీరు వారికి సమాధానము చెప్పుటయేగాక ప్రభుత్వవర్తనను బలపఱచుచుండెడివారు. కొన్ని సందర్భములలో స్వీయాభిప్రాయములకు విరుద్ధముగ శాసనసభలో వ్యవహరించుట వీరికి ప్రాణకంటకముగ నుండెను. అప్పుడప్పుడు ప్రభుత్వమువారికిని శ్రీమాంటిగారికిని అభిప్రాయభేదములు జనించుచుండెను. వీరికి

C. I. E. బిరుదు ఇచ్చినచో సంతృప్తిజెంది ప్రభుత్వ చర్యల నన్నిటిని న్నామోదించునని రాష్ట్ర అధికారులు తలచినది పొరబాటు. స్వతంత్రబుద్ధిగల వీరు ఏవిషయమునుగాని తన యంతరాత్మసూచించునట్లు విమర్శించుట వీరి అలవాటు కావున నితరుల సంతృప్తి గావించుటకై స్వీయాభిప్రాయముల దాచు కొందురని అధికారులు తలచినది హాస్యా స్పదము. ఏపదవి తన కక్కరలేదనియు తన విధ్యుక్త కార్యముల తనకు తోచినట్లు నిర్వహింతుననియు ఒకమారు గవర్నరుగారితో చెప్పిరట. శ్రీగాంధీతో భిన్నాభిప్రాయములు జనించినపుడు కాంగ్రెసుసంస్థకు సంబంధించిన పదవులన్నిటిని తృణప్రాయముగఁజూచి ప్రముఖులెందరు ఎంతజెప్పిననువినక కొందఱు ప్రజలు వీరిని అల్లరిసాగించువారనిచెప్పుచున్నను సన్నిహిత్య ముగనుంటూ తనసిద్ధాంతములను విరుద్ధముగా ఎన్న డును వర్తింపనని ఘంటాపథముగా శ్రీగాంధీ గారితో చెప్పిరి. ఎందునగానీ తనచిత్తవృత్తికి భిన్న ముగా ఎన్నడును వర్తింపరనుసంగతి లోకవిదిత మాయెను. వీరు ఆరోజులలో అడ్వకేటుజనరలు పదవిలోనుండుట కుటుంబమువారికి సంతృప్తినికలి గించెను. వాకిట నిద్దరుజవానులు డబ్బాడవా

లీలతో నిలచుట కొందఱికి గొప్పగ కనబడినదేగాని శ్రీమార్గారు ఇట్టిదర్జాల లక్ష్యపెట్టువారుకారు. శ్రీమార్గారికృషివల్లనే అడ్వకేటుజనరలునకు భృతి హెచ్చింపఁబడెనుగాని వీరు అడ్వకేటుజనరలుగా నున్నప్పుడు 1500 మాత్రమే నెలకు లభించుచుండెను. తనకార్యదీక్ష, బుద్ధికుశలత అపారసామర్థ్యము మున్నగువానిపై వీరికి పూర్తిగా నమ్మకమున్నందు వల్ల తనమిత్రులు సందర్శించినపుడు తాను సాగించు ఉన్నతకార్యములఁగూర్చి చెప్పెడివారు. పదవినిచ్చిరని ప్రభుత్వమును గొప్పగభావింపక తనయోగ్యత వల్లనే పదవినిచ్చిరని తలంచెడివారు.

శ్రీఆనిబిసెంటుగారు హోంరూలు ప్రచారము సాగించుచు తన న్యూఇండియాపత్రికలో తీవ్రముగ మదరాసుప్రభుత్వమును నిరసించుచుండెనని అధికారులు చర్యపూనినపుడు శ్రీమార్గారు అడ్వకేటుజనరలుగనున్నందుచే ఆనిబిసెంటునకు విరుద్ధముగ హైకోర్టున దావాలలో వాదింపవలసివచ్చెను. ఉభయులకు నాడుపత్రికలలో వివాదములుసాగుచుండెను. ఆనిబిసెంటునకు ప్రతికూలముగ వర్తించినచో శ్రీమార్గారిని చంపివేయుదుమని ఆకాశరామన్న జాబులు వీరికివచ్చెనుగాని వీనినెంత మాత్రములక్ష్యపెట్టక విధ్యుక్తకార్యముల నిర్వ

హించుచుండిరి. శ్రీ ఆనిబిసెంటుగారిని జైలునపడ వేయవలయునని గవర్నరు పెంట్ లేండ్ అభిప్రాయ పడి శ్రీమార్ గారి సలహానుకోరగా గొప్పవ్యక్తి యగు ఆనిబిసెంటును సామాన్యులైదీగ భావింపరా దనియు ఉదకమండలమున ఒకప్రదేశమున వీరిని కాపుసలతో నుంచుమనియు శ్రీమార్ గారు సలహా చెప్పితినని మిత్రులతో చెప్పెడివారు. అప్పటినుండియే అడ్వకేటుజనరలుపదవినిపదలుకోవలెనను నూహ వీరికి జనించెను.

పెంట్లేండ్ ఇంగ్లాండువెళ్లినమీదట విల్లింగ్డన్ మహరాజు రాష్ట్రగవర్నరాయెను. కాని వీరిమధ్య మనస్పర్థలు క్రమేణ హెచ్చాయెను. అడ్వకేటుజన రలుగ వీరు సూచించినసలహాలు విల్లింగ్డనుకు ప్రాణ కంటకముగనుండెను. కావున గవర్నరుగారిపార్టీలకు గూడ వీరువెళ్లరైరి. తనంతట తాను గవర్నరును సంద ర్శించుటమాని వీరాహ్వానించినపుడు మాత్రమే గవర్న మెంటు హౌసుకువెళ్లెడివారు. ఇందుకు కొన్ని సంవత్సరములు ముందే ఐరోపియనులపై ఒక మోస్తరు నిర్లక్ష్యభావము వీరియందంకురించెను. కొన్నిసందర్భములలో ఐరోపియనులు భారతీయుల కన్న గొప్పవారని తనమనస్సున అభిప్రాయమున్నను, భారతీయుడెవడుగానీ విదేశీయునిచే చులకనగా

చూడబడుసందర్భమును వీరు గర్హించెడివారు. ఐరోపియనులు భారతీయులకు సమానగౌరవము చూపవలెననిపట్టుబట్టుటకు ప్రారంభించిరి.

అప్పట్లో నింటియం దొకరోజున భార్యతో మాట్లాడుచు గవర్నరు విల్లింగ్డన్ తమ్ము యిబ్బంది పాలు గావించుచున్నాడనియు పాడుపదవిని వదలుకొననిశ్చయించితిననియు జెప్పిరి. కాని, వీరిభార్య ఇందుకు ఏబదులుచెప్పలేదు. ఆరునెలలు శ్రీ కనిబిసెంటురు ఉదకమండలమున కాపురములోనుంచి ఆమీద వదలిపెట్టిరి. అప్పుడే శ్రీగాంధీగారి ఉద్యమము భారతదేశమున నావిర్భవించెను. కావున శ్రీ గాంధీగారి శాసనోల్లంఘనకృషి వీరికి అసంతృప్తిని గలిగించెను. కొంతకాలమునకు శ్రీగాంధీగారి యుద్యమమున శ్రీమూర్ పాల్గొనుటకు ప్రారంభించిరి. 1919 సం॥న ఏప్రిలునెలలో 'జలియన్ వాలా భాగున' పంజాబురాష్ట్రమునసైనికప్రభుత్వనిర్మాణము రాత్రులలో పైకివెళ్ళరాదనియు పైకివెళ్ళినవారిని కాల్చెదమనియు ప్రభుత్వముశాసించుటచే భారతీయులందఱిని కలవరపెట్టుటయేగాక యీదురన్యాయముల తుదముట్టింప తీవ్రప్రయత్నములు అచ్చటచ్చట ప్రారంభింపఁబడెను. సర్. శంకరన్

నాయరువంటి మితవాద శిఖామణులుగూడ బ్రిటిషు ప్రభుత్వచర్యలవల్ల అసహ్యముజనించి, హైకోర్టు పదవికి రాజీనామాయిచ్చిరి. కావున శ్రీమాన్ అయ్యంగారు అప్పుడేగాకున్నను, కొన్నినెలలకు అడ్వొకేటుజనరలుపదవికి రాజీనామాయిచ్చిరి. ఈ సందర్భమున భార్య అభిప్రాయమును వీరు కోరిరి గాని యామె మౌనమువహించియుండెను. అనే కాంశములలో వీరుభయులు సంప్రతించినమీదనే శ్రీమాన్‌గారు ఒక తీర్మానమునకువచ్చెడివారు. పాత్రము ననుసరించి మాట్లాడుస్వభావము శ్రీమాన్‌గారికి నెప్పుడు నలవడలేదు కావున తనకు తోచిన దానిని పైకి చెప్పుచుండెడివారు. 1920 సం॥ ఫిబ్రవరిలో ఒకరోజున కోర్టునుండి ఇంటికిరాగానే పదవిని వదలుకొంటినని భార్యకు తెలియఁజేసిరి. వీరు కాంగ్రెసునఁజేరి ఎన్నడు కారాగారము ప్రవేశింతురో యనుభయము భార్యకు జనించెను. కాని భార్య తనభీతిని వెల్లడింపక పదవిని వదలినందుకు ఆమోదమును సూచించెను.

శ్రీమాన్‌గారు పదవిని వదలినవెంటనే కాంగ్రెసున ప్రవేశింపలేదు. సర్కారుపక్షములోచేరక స్వతంత్రులుగా వ్యవహరించుచుండిరి. అందుమీదట దేశము

నకు ఇప్పట్లో తానే సేవయు గావింపలేననిచెప్పిరి. సహాయనిరాకరణోద్యమము వీరిదృష్టిని ఆకర్షింపలేదు. కావుననే యూనివర్శిటీ స్థానమునకు పోటీచేసి మదరాసు రాష్ట్రశాసనసభ్యులైరి. రాష్ట్రసభలో ప్రభుత్వకక్షకు వ్యతిరేకముగా నుపన్యాసముల నిచ్చుటకు ప్రారంభించిరి. కాని యిందుతో వీరి యాశయము పూర్తికాలేదు. 1920 సం॥ న మదరాసు రాష్ట్రమున రాజకీయమహాసభను వైభవముగ జరుపుటకు తిరునల్వేలిజిల్లావాసియు, సుప్రసిద్ధజాతీయవాదియు, దేశసేవకుఁడు నగు శ్రీ వి. ఓ. చిదంబరం పిళ్లెగారు ఏర్పాట్లుగావించిరి. ఈమహాసభకు పూనా నుండి శ్రీ బాలగంగాధరతిలక్ మహాశయులు మున్నగువారు వచ్చుట కంగీకరించిరి.

1905 సం॥ తిరునల్వేలిలో మదరాసురాష్ట్రమహాసభ శ్రీ వి. కృష్ణస్వామిఅయ్యరుగారి యాజమాన్యమున జరిగెను. శ్రీ చిదంబరంపిళ్లెగారు శ్రీమాన్ అయ్యంగారిని 1920-వ మహాసభకు నధ్యక్షులుగా నుండు మని కోరి యందుకు వీరు సమ్మతించినమీఁదట నాహ్వానసంఘమును సమావేశపఱచి శ్రీమాన్‌గారిని అధ్యక్షునిగా నేకగ్రీవముగా నెన్నుకొనునట్లుచేసిరి. ఈమహాసభకు భారతీయ ప్రముఖులనేకులు వచ్చిరి. గా॥ వి. ఎస్. శ్రీనివాసశాస్త్రి, శ్రీ సి. పి. రామ

స్వామిఅయ్యరు, దివాన్ బహదరు శ్రీ గోవిందరాఘవయ్యరు, దివాన్ పి. పి. మాధవరావు, శ్రీ యస్. కస్తూరి రంగయ్యంగారు, శ్రీ ఏ. రంగస్వామిఅయ్యంగారు, గౌ॥ కే. వి. రంగస్వామిఅయ్యంగారు, శ్రీ యస్. సత్యమూర్తి, శ్రీ చల్లా గురుస్వామిశెట్టి, డా. యు. రామారావు, శ్రీ యాకుబ్ హసన్ సేట్, డా. శ్రీ వరదరాజులునాయుడు, చాలకాలము అరవింద ఘోష్‌గారితో సహచరులుగనుండిన శ్రీ వి. వి. ఎస్. అయ్యరు మున్నగువారేగాక దక్షిణజిల్లాలలో నుండు వకీళ్లు, వర్తకులు అనేకు లీసభకు విచ్చేసిరి. రైలు ఎగ్మూరుస్టేషనువదలినది మొదలు ప్రతిరైలు స్టేషనున వేలకొలదిజనము శ్రీ తిలకుగారిని, శ్రీమాన్ గారిని సందర్శించి సత్కరించుటకు హాజరైరికాని అనారోగ్యముచే శ్రీ తిలకుగారు రాలేదని ప్రజా సమూహమునకు తెలియగానే వారు నిస్పృహులైరి. రైలుమార్గమున శ్రీ తిలకుగారికి సత్కారముగావింప వలసిన ఏర్పాట్లన్నియు శ్రీమాన్‌గారికికూడ లభించెను. మరునాటిరాత్రి 8 గం॥ తిరునల్వేలి రైలు స్టేషనుదిగగానే 6 ఏనుగులు కనబడెను. 3 ఏనుగులు ముందును, 3 ఏనుగులు వెనుకను నడచుచుండగా రైలుస్టేషనునుండి పాళయముకోటవరకు, గౌరవార్థము వేలకొలది ప్రజలతో నిండెను.

పాళయముకోట క్లబ్బు ఆవరణమున ప్రముఖులందఱి కిని బసలు ఏర్పాట్లుగావింపఁబడెను కావున బండ్లుదిగి. మేమందఱము క్లబ్బున చేరుకొంటిమి.

ఈమహాసభలో పంజాబుదురంతములగూర్చి, శ్రీమాన్‌గారు గొప్ప ఉపన్యాసముగావించి, ప్రభు త్వోద్యోగులవర్తనను పూర్తిగఖండించిరి. విషయ నిర్ణయకసభ రాత్రి 1 గం॥ వరకు సాగి యనేకులు వారికితోచిన యభిప్రాయముల వారు వారువెల్లడిం చిరి. ఆతీర్మానములలో ముఖ్యమైనది 'ఖిలాఫత్' గాన దీనిని శ్రీమాన్ ఎస్. కస్తూరి రంగయ్యంగారు మహాసభలో నెగ్గింపవలెనని విషయనిర్ణాయకసభలో తంటాలుపడిరి. శ్రీ సత్యమూర్తిగారు తిరునల్వేలి సమీపములోనున్న పేటలో 30 వేలమంది సమా వేశమైన సభలో 'ఖిలాఫత్' తీర్మానమునకు అను కూలముగా ప్రసంగించిరి. ఈసభకు వేలకొలది తుర కలుకూడ వచ్చియుండిరి. ఈసంగతి ఉదయము శ్రీమాన్‌గారికి తెలియఁగానే మండిపడి మహా సభలో శ్రీ సత్యమూర్తిగారు మాట్లాడుటకు అవ కాశము ఇవ్వరైరి. ముందురాత్రి శ్రీ కస్తూరి రంగయ్యంగారు శ్రీమాన్‌గారితో ప్రముఖుల యెదుట ఖిలాఫత్ తీర్మానముగూర్చి తనకు పట్టుదలలే.

దని విస్పష్టముగఁజెప్పి మరునాడు సభలో యాకుబ్ హాసన్ గారిచే తీర్మానమును ప్రతిపాదింపించినందుకు శ్రీమాన్ గారే గాక యితర ప్రముఖులనేకులు ఆశ్చర్యపడిరి. ఈతీర్మానము ఈమహాసభలో నెగ్గినందుచే ముందు అనేకచిక్కులు, కష్టలు ఏర్పడి శ్రీ సి. రాజగోపాలాచారి ప్రోత్సాహమున శ్రీ గాంధీగారు కలకత్తా స్పెషల్ కాంగ్రెసున సహాయ నిరాకరణతీర్మానమును నెగ్గించుటకు అవకాశ మేర్పడెను.

శ్రీమాన్ గారు తిరునల్వేలివదలగానే దక్షిణదేశమున ననేకచోట్లకువెళ్లి సత్కారములనొంది చెన్నపట్టణముచేరుటకు 15 రోజులుపట్టెను. ఇంటికిరాగానే అడ్వకేటుజనరలుపదవిని వదలినట్లే C. I. E. బిరుదమునుకూడ వదలిరి. ఇంటనున్న విదేశీబట్టలు వస్తువులు మున్నగు వాని మూలపడవేసి స్వదేశీవస్తువులు, దుస్తులు మున్నగువానికి ప్రాముఖ్యతయిచ్చుటకు ప్రారంభించిరి. ఆమీాద కేరళదేశమునకు ప్రయాణమై కొన్నిసభలలో సహజవాగ్ధోరణితో ప్రభుత్వదురంతముల ప్రజాసామాన్యమునకు తెలియఁజేయుచు నుపన్యాసముల సాగించిరి. కళ్లికోటలో ఒక సభయందు వీ రుపన్యసించుచు పదవిని, బిరుదమును వదలినందుకు కారణములనుగూడ వెలిబుచ్చిరి. ఆ

మీద కొన్నిరోజులకు శ్రీమాన్ ఎ. రంగస్వామి అయ్యంగారు, నేను శ్రీమాన్‌గారిని సందర్శించి వారి బంగళాలో చాలాసేపు మాట్లాడుచుండగా శ్రీ సత్యమూర్తిగారుగూడ నచ్చటికి వచ్చిరి. మే మందఱము గోఖలేహాలున సభగావించి మీరు అడ్వకేటుజనరల్ పదవి వదలినందుకు అభినందింపఁదలచితి మని శ్రీమాన్‌గారితో చెప్పగా మాయొత్తిడివల్ల గోఖలేహాలుసభకు వచ్చుటకు అంగీకరించిరి. గోఖలేహాలుసభ జయప్రదముగ సాగెను శ్రీమాన్‌గారు బ్రిటిషు ప్రభుత్వ చర్యలన్నిటిని దీర్ఘోపన్యాసమున నిరసించిరి. సభ్యులకు వీరు అడ్వకేటు జనరలుపదవిని వదలిరని శ్రీసత్యమూర్తిగారు వెల్లడింపఁగానే హాలునఁ గూడియున్నవారు జయధ్వానములు కొంత సేపుగావించిరి. ఆమీద నీక్రిందియంశములగూర్చి పత్రికలలోకొన్ని వ్యాసముల ప్రకటించిరి.

"భారతదేశమునంతటను అధికారులు ప్రజల ననేకవిధముల బాధపెట్టుచున్నందువల్లనే యీ దురంతముల సహింపలేక అడ్వకేటు జనరలుపదవినే గాక ప్రభుత్వము నాకిచ్చిన C. I. E. బిరుదమును గూడ వదలుకొంటిని. శాసనసభలో నధికారుల చర్యల నిరసించుచు నుపన్యాసములు సాగించితిని గాని యవి నిష్ప్రయోజనమగుటచే శాసనసభ

త్వముగూడ వదలుకొంటిని. యూనివర్సిటీ పట్టభద్రులు నన్ను వారి ప్రతినిధిగ నెన్నుకొనిరేగాని నావర్తనను వారాక్షేపింపరనియే తలంచుచున్నాను. నావంటి జాతీయవాదులు ఇండియాకు నితర బ్రిటిషు డొమినియన్లగుండా స్వాతంత్ర్యము లభించుటకు నిరంతరము పాటుబడుట విధి కావున ప్రజాసామాన్యము నాకృషికి తోడ్పడు టవసరమని చెప్పుచున్నాను. శ్రీగాంధీతో నాకు అభిప్రాయ భేదము కలదు కావున, పాఠశాలలు, న్యాయస్థానములు, శాసనసభలు మున్నగువాని బహిష్కరించుటకు దేశము సంసిద్ధముగ లేదని, శాసనోల్లంఘన మసలే సాధ్యముకాదని నాయభిప్రాయము. ఇతర కాంగ్రెసునాయకుల యభిప్రాయములతో పై సందర్భమున నేను అనుకూలత కనఁబరచకపోయినను అధిక సంఖ్యాకులు శ్రీగాంధీగారి కృషికి తోడ్పడిరి నచో నేను నాయంతరాత్మకు విరుద్ధముగా వర్తింప శక్యముకాదు. క్రిమినలు లా అమెండ్‌మెంటు ఆక్టు మున్నగు చట్టముల రాష్ట్రాధికారులు అమలునం బెట్టుచున్నందున ప్రజాప్రతినిధులైన మంత్రులుగూడ నిందుకు సహకారముగ నున్నారు. ఇట్టివారిని ప్రతినిధులుగా నెన్నుకొనక యుండుటకు కొంత ప్రచారముసాగింప నవసరము కావున నిందులకు

ప్రజలసహాయము ఆశించుచున్నాను. కాంగ్రెసు సభలోనుండి ఏల కృషిసాగింపరాదని నన్ను కొందరు ప్రశ్నించిరి. కాని ఇప్పటి శాసనసభల వాతావరణమున జాతీయవాదిగాను సభ్యుడుగాను ఉండుట వీలుకాదని నేను భావించుచున్నాను.

కాంగ్రెసున శ్రీమాణ్గారు ప్రవేశించినమీదట వీరిని ఇంటిలో సందర్శించుటకు కూడ వ్యవధిలేక పోయెను. ఇంటివారుకూడ వీరి నిరంతర ప్రయోజనములకు ఆశ్చర్యపడెడివారు. తిథివారముల గణింపక తలచినప్పుడు ప్రయాణము సాగింతురు కావునను, వీరివెంబడి కాంగ్రెసు అనుయాయులు యెందరో రేయుంబవళ్లుందురు కావునను ఇంటివారు వీరితో మాట్లాడుటకు కూడ అవకాశములేక చిక్కుపడెడివారు. ఏయూరికిగాని కాంగ్రెసుపనిమీద వీరు వెళ్లినప్పుడు స్వంతఖర్చులతోనే ప్రయాణముల సాగించెడివారు. ఒక్కొక్కప్పుడు రెండవక్లాసు పెట్టెలోకూడ ప్రయాణము సాగించెడివారు. కాంగ్రెసు సూచించినట్లు పండిత శ్రీమోతీలాలు నెహూ్రు, శ్రీసీ. ఆర్. దాసు మున్నగువారు కోర్టులకువెళ్లుటమానిరి కావున శ్రీమాణ్గారుకూడ హైకోర్టునకు వెళ్లుట మానిరి. పాతకేసు లొకటిరెండు

పరిష్కారము కాకయున్నందున దీనికిగాను ఎన్నడైన నొకరోజు కోర్టుకు వెళ్లుదురే కాని క్రొత్తకేసులపట్టరైరి. ఇంటికివచ్చిన పాతకక్షిదార్లకు తనయభిప్రాయములను కోరినప్పుడు తెలియఁజేయుచుండెడివారు. రాబడి తగ్గినందున పరిస్థితికి తగినట్లు ఖర్చు తగ్గించుకొనుమని ఇంటివారిని అప్పుడప్పుడు హెచ్చరించెడివారు. శ్రీమాఁగారు కాంగ్రెసున చేరినమీదట అంజద్ బాగ్ బంగళాకు నెందరో ప్రముఖులు వచ్చు చుండిరి. దూర ప్రదేశములనుండి వచ్చువారు కొందరు వీరి బంగాళాలో బసచేసెడివారు. కాని ఇంటిలోని స్త్రీలకు అతిథులతో నే సంబంధము లేక యుండెను. అతిథులు ఇంటిలోపలికి భోజనము సేయుటకు వచ్చినప్పుడు, భోజనముచేసి బయటకు వెళ్లినప్పుడును అతిథులను ఇంటివారు చూచుటకు అవకాశముండెడివి. ఏగొప్పవారు కాని శ్రీమాఁగారి యింట బసచేసి స్వస్థలములకు వెళ్లుటకు ప్రయాణ మగుచు శ్రీమాఁగారి భార్యకు నమస్కారములు చేసివెళ్లెడివారు. ఇట్టి ఆచారము ఉత్తరహిందూస్థాన మున గలదని తెలియుచున్నది. ఈయతిథులలో ఒక రగు శ్రీ మహాదేవదేశాయి శ్రీమాఁగారి భార్యకు నమస్కారములుచేసి సెలవుపుచ్చుకొనుటను చూచి

ఇంటిలోనున్న వారే కాక ఇంటికివచ్చియున్న వారు కూడ ఆశ్చర్యపడిరి. శ్రీగాంధీ, శ్రీస్వామి శ్రద్ధానంద గారలు శ్రీమార్క బంగాళాకు వచ్చినపుడు వీరిని లోపలికితీసికొనివెళ్లి ఇంటివారికి పరిచయము గావించినపుడు అందఱును వందనములసమర్పించిరి. శ్రీ గాంధీ ఆపిమ్మట శ్రీమా నింటివారిని దగ్గరకు పిలచి సంకోచము లేక సంభాషించుచుండిరి. కాషాయ వస్త్రముల ధరించిన శ్రీ శ్రద్ధానందగారు గంభీరముగ కనబడెడివారు. కావున వారిని సమీపించుటకు శ్రీమార్క కుటుంబము వారు సాహసింపలేదు కాని దూరమునుండి నమస్కరించెడివారు.

1921 సం॥న డిసంబరు 27 వ తేదీన నహమ్మదా బాదున కాంగ్రెసుమహాసభసాగుటకు అన్ని యేర్పా టులు గావింపఁబడెను. శ్రీమార్కగారు అహమ్మదా బాదువెళ్లుటకై సెంట్రలు స్టేషనుకు వెళ్లిరి. ఈ కాంగ్రెసు సమావేశమునకు త్యాగధురీణులగు శ్రీ చిత్తరంజనదాసు అధ్యక్షులుగా ఎన్నుకోబడిరి. కాని ప్రభుత్వమువారు శ్రీదాసుగారిని కారాగార మున నిర్బంధించిరి. కావున హకీమ్అజీమల్ఖాను గారు శ్రీసి. ఆర్. దాసుగారి స్థానమున అధ్యక్షులైరి. ఈకాంగ్రెసు సమావేశమునందు సహాయనిరాకరణ

కృషివల్లనే భారతస్వరాజ్యము సంపాదింపఁబడవలె నని తీర్మానింపబడెను. ఏతీరున సహాయనిరాకరణ విధానమును ఆచరణలోపెట్టవలెనో అందుకవసర మైన సూచనలన్నియు కాంగ్రెసున వెల్లడియాయెను. అదిమొదలు శ్రీమాన్‌గారికి కాంగ్రెసు కార్యక్రమమున ఉత్సాహమధికమాయెను.

1922 సం॥న దేశమున అనేకసంభవములు తటస్థించెను. మలబారున మాప్లాలు అల్లరి ప్రారంభించిరి. ఉత్తరహిందూస్థానమున 'చౌరీచౌరా' కాల్పులుజరిగెను. దేశమంతట హర్తాళ్లు, దుకాణముల మూతలు సంభవించెను. దీనిఫలితముగా బొంబాయి నగరమున ఎన్నడులేని అల్లరి జనించెను. ఈపై సంభవములవల్ల గాంధీగారికి తన అహింసాసిద్ధాంతముపై పట్టుదలహెచ్చాయెను. దీనిఫలితముగా బర్డోలీలో ప్రారంభింపఁదలచిన పన్నుల నిరాకరణ కార్యక్రమమును ఆపివేసిరి. తనతీర్మానము గొప్ప పొరబాటని తనకుతెలియునుగాని విధిలేక పైతీర్మానము గావించితినని వెల్లడించిరి. ఆమీఁద గాంధీగారిపై రాజద్రోహనేరముమోపి వీరిని అధికారులు నిర్బంధించిరి. గాంధీగారు విచారణలో పాల్గొనననియు, తనకు శిక్షవిధించుటకు స్పెషలుకోర్టున కధి

కారములేదనియుచెప్పి ఒక స్టేటుమెంటును వ్రాసి చదివిరి. ఈవిధముగ బ్రిటిషు అధికారవర్గమును గాంధీ తృణీకరించినందుకు భారతీయులేగాక విదేశీయులెందరో సంతృప్తిజెందిరి. 1922 సం॥ డిసంబరు 25 వ తేదీన గయలో కాంగ్రెసు సమావేశము అగుటకు ఏర్పాట్లుగావించిరి. శిక్షాకాలము పూర్తియయి విడుదలగావింపఁబడిన శ్రీసి. ఆర్. దాసుగారు అధ్యక్షులుగా ఎన్నుకోఁబడిరి. ఈకాంగ్రెసునఁ పండిత శ్రీమోతీలాలు 1923 సం॥న సాగింపఁబోవు రాష్ట్ర, ఢిల్లీ శాసనసభల ఎన్నికలలో కాంగ్రెసుకక్షివారు పాల్గొనవలెననెడి తీర్మానమును ప్రతిపాదింపసంసిద్ధులైరి. ఇందుకు శ్రీసి. ఆర్. దాసుగారుకూడ ఆమోదమునుసూచించిరి. కాని శ్రీగాంధీగారు కారాగారవాసిగాఉన్నప్పుడు ఇట్టి తీర్మానమును ప్రతిపాదించుట గొప్పపొరబాటని శ్రీ సి. రాజగోపాలాచారిగారు తిరుగబడిరి. అంతటితో తృప్తిజెందక శాసనసభలతీర్మానము నొకదానిని వీరు ప్రతిపాదించిరి. ఆమీఁదట గయకాంగ్రెసున రెండుకక్షులు ఏర్పడెను. శ్రీ రాజేంద్రప్రసాదుగారు రెండుకక్షులను సంతృప్తిగావింపఁదలచి కాబోలు తన అభిప్రాయమును ఉపన్యాసమున వెల్లడింపలైరి. కాని లోలోపల రహస్య

ముగ శ్రీ సి. రాజగోపాలాచారిగారి తీర్మానమునకే ఆమోదము సూచించిరని అనేక కాంగ్రెసు డెలిగేట్లు గుర్తించిరి. ఇట్టి సందర్భమున శ్రీమాన్ అయ్యంగారు తన సవరణతీర్మానమును ప్రతిపాదింప యత్నించిరికాని శ్రీరాజగోపాలాచారిగారు ఇందుకు సమ్మతింపరైరి. కావున శ్రీ రాజగోపాలాచారిగారి అభీష్టమే నెరవేరెను.

గయ కాంగ్రెసునకు శ్రీమాన్అయ్యంగారితో నేను వెళ్లియుంటిని. అప్పుడు నేను ఆల్ఇండియా కాంగ్రెసున సభ్యుఁడుగనుంటిని కావున, అనేక విచిత్రాంశములను గుర్తింపగలిగితిని. దేశాభిమానులమనియు, స్వార్థత్యాగముచేసినామనియు చెప్పుకొను నాయకుల వర్తనల చూడగ అనేకులకు అసహ్యము పుట్టించెను. తెనుఁగువారిలో శ్రీ కొండా వెంకటప్పయ్యకును, శ్రీ పట్టాభి సీతారామయ్యకు ఉన్న విభేదములవల్ల సకాలమున ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సభ డెలిగేట్ల ఎన్నికను సాగింపక కాలహరణము గావించి చివరకు గయలో పిండములు పెట్టుటకు వచ్చిన పితంతువులను గూడ జేర్చి, శ్రీపట్టాభిసీతారామయ్యగారు, శ్రీబ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యము

గారును, డెలిగేట్లలిష్టును వ్రాసి అధ్యక్షులగు శ్రీ సి. ఆర్. దాసుగారికి అందించిరి. అప్పటికే నాకు శ్రీ సి. ఆర్. దాసుగారితో చక్కనిపరిచయ మేర్పడి యుండెనుగాని శ్రీ మార్ అయ్యంగారు శ్రీ సి. ఆర్. దాసుగారిని ఎరుగరు. అందుచే మేము మదరాసు నుండి 4 రోజులు ముందుగా ప్రయాణమై కలకత్తా చేరితిమి. కలకత్తాన గొప్పమార్వాడీ సాహుకారు శ్రీ మార్ గారి కక్షిదారుడు గావున వారిభవనమున బసయేర్పాటాయెను. బ్రహ్మాండమైన మోటారుకారున శ్రీ మార్ అయ్యంగారిని, నన్ను శ్రీ చమేరియా కుమారుడు హౌరా స్టేషనునుండి వారిబసకు తీసికొని వెళ్లి వారి భవనమునం జేర్చిరి. మదరాసువంటవారిచే అద్భుతమైన వంటలగావించి, స్నానమునకై నూనె, శీకాయి మున్నగువాని నిప్పించిరి. నౌకరులు ముందు శ్రీ మార్ అయ్యంగారి వంటమనిషి స్నానమునకు ఏర్పాట్లు గావించిరి. వంటమనిషి స్నానముచేయగానే శ్రీ మార్ గారికిని నాకును తలాఒక కప్పు కాఫీ తెచ్చియిచ్చి మరల భవనములోనికి వెళ్లెను. కొంత సేపటికి మావద్దకువచ్చి వంటప్రారంభించితిననియు, పావుగంటలో అన్నియు సిద్ధమగు ననగా మేము

భోజనమునకు ముందు తలంటి స్నానముగావించి చేయుదు మంటిమి. శ్రీమార్గ అయ్యంగారు కావలసిన ఆహారము సిద్ధమగుటకు వ్యవధియగునని తలచి నన్ను చమేరియా సిద్ధముగావించిన యాహారముభుజించి వెంటనే కారున శ్రీసి. ఆర్. దాసుగారింటికి వెళ్లుమని ఆదేశించిరి. నేను భోజనము చేయగానే శ్రీ చమేరియా కుమారుని పిలచి నన్ను శ్రీసి.ఆర్. దాసుగారి ఇంటికి కారున తీసికొని వెళ్లుమనిరి. నేను కారుఎక్కుచు తిండితినగానే శ్రీమార్గగారిని శ్రీసి. ఆర్. దాసుగారివద్దకు రమ్మని కోరుచు వారికై కారును పంపివేయుదునని చెప్పితిని. కాని ఎన్నిగంటలకు తాను రావలెనో శ్రీ సి. ఆర్. దాసుగారు నిష్కర్షగా నాతో చెప్పినగాని తాను బయలుదేరనని చెప్పిరి.

శ్రీమార్గగారితో చర్చించుటవల్ల లాభముండదని నాకు తెలియుటవల్ల చమేరియా కుమారునితో బయలుదేరి రస్సారోడ్డునకు వెళ్లితిని. గొప్పకారు కావున అయిదారుమైళ్లలోనున్న శ్రీసి. ఆర్. దాసుగారింటికి కొన్ని నిమిషములలో చేరుకొని, పైకివెళ్లితిని. శ్రీసి. ఆర్. దాసుగారి భవనమువారు సహాయనిరాకరణోద్యమములో చేరుటకు ముందు వారి

ల్లు వాకిలినుండి వస్త్రకంబళ్లతో కప్పఁబడి యుండెడిది. వీరు సునాయాసముగ బారిష్టరు వృత్తిలో నెలకు 30,40 వేలు ఆర్జించెడివారు. ఆరోజులలో వీరు దుస్తులు 3 గంటలకు ఒకమారు మార్చెడివారు. ఇట్టి దేశత్యాగి సర్వస్వమును త్యజించి మేడమీద ఒక కొయ్య కుర్చీమీద కూర్చొని ఒక ముతకకంబళిని పైనకప్పుకొని గయ కాంగ్రెసుకు అధ్యక్షోపన్యాసము వ్రాయించుచుండిరి. వారిముఖము చూడగానే నామనస్సున ఎన్నడును లేని సంకటము గలిగి మాటతోచక కొంతసేపుంటినిగాని వారు నన్ను ఆదరించి వచ్చినపనిని సూచించుమని కోరిరి. గయకాంగ్రెసునకు శ్రీమార్క్‌గారు, నేను వెళ్లుచు మార్గమున శ్రీమార్క్‌గారిని తమకు పరిచయము చేయుటకు కలకత్తాలో ఆగినట్లు చెప్పగానే వారిని లోపలికి దయచేయుమని ఏల చెప్పలేదని ప్రశ్నించిరి. వారు చమేరియాభవనమున ఆహారము పుచ్చుకొను చున్నారనియు, సెలవైనచో వెళ్లి పిలుచుకొనివచ్చెద ననియు చెప్పితిని. ఆమీద శ్రీమార్క్‌గారిని వెంట బెట్టుకొని శ్రీ దాసుగారివద్దకు వచ్చితిని. పాట్నా హైకోర్టుజడ్జియు శ్రీసి. ఆర్. దాసుగారి సోదరులు

నగు శ్రీసి. ఆర్. దాసు గారు జడ్జిపదవికి రాజీనామా ఇచ్చి తమ్మునిచూచుటకై వచ్చిరి. వీరురాగానే శ్రీ సి.ఆర్.దాసుగారు సిగరెట్ త్రాగుటనుచూచి అన్నిటిని వదలిపెట్టిన నీవు ఈపాడుసిగరెట్లుకాల్చు అలవాటును ఏల వదలిపెట్టలేదని ప్రశ్నించగా తనముందున్న బంగారు సిగరెట్టుకేసును కిటికీగుండా వీథిన పాఱవైచిరి. ఇందుకు అందరు ఆశ్చర్యచకితులైరి గాని త్యాగమూర్తియగు దాసుగారునిర్లక్ష్యముగనుండిరి. శ్రీదాసుగారు తన అధ్యక్షోపన్యాసమందలి కొన్ని భాగములను శ్రీమాక్‌గారికి వినిపించి, ఆమీాద రాజకీయ పరిస్థితులనుగూర్చియు, శ్రీ గాంధీగారి మొండిశిఖండిత్వమును గూర్చియు ముచ్చటించిరి. ఈలోగా నాటి అమృతబజారు పత్రిక రాగా దానిని శ్రీమాక్‌గారు చదువుచుండగ ఈలోగా నేను ఆంధ్ర కాంగ్రెసుకమిటీ ఉపాధ్యక్షుడనియు, డెలిగేట్ల ఎన్నికలపై ఏసమావేశము జరుగలేదనియు, శ్రీ పట్టాభి సీతారామయ్య మున్నగువారు తమకు తోచినపేళ్లను కొన్నిటిని నమోదుగావించిన ఒక లిష్టును, ఈదురన్యాయములన్నియు తనకు బారిష్టరు ఉన్నవ లక్ష్మీనారాయణగారు నాటిఉదయమే తెలియజేసిరనియు చెప్పిరి. డెలిగేట్ల (ఆంధ్ర) ఎన్నిక సక్రమముగ సాగనందుచే గయకాంగ్రెసు

నకు ఆంధ్ర డెలిగేట్లెవరును రాను వీలుకాదని తా నొక ప్రకటనగావింప దలచినానని చెప్పి అధ్యక్షుని హోదాలో తనకుతోచిన అయిదారుగురిని మాత్రమే డెలిగేట్లుగా పరిగణింతునని విస్పష్టము గావించిరి.

ఆమీాద మరి కొంతసేపు శ్రీమూర్, శ్రీదాసు సంభాషించినమీాదట నేను, శ్రీ అయ్యంగారు శ్రీ చమేరియా బసకు వచ్చిచేరితిమి. నాటిరాత్రి తాను గయకుబయలుదేరనని శ్రీసి.ఆర్.దాసు గారు చెప్పిరి. వంద బెంగాలు డెలిగేట్లతో మరునాడు ప్రయాణము సాగింతుననియు, మరికొందరి రాకను ఎదురుచూచు చున్నాననియు వారు చెప్పియుండిరి. కాని స్పెషలు ట్రైయినున వెళ్లినచో శ్రమకు పాత్రుడనగుదునని శ్రీమూర్ భావించిరి. ఆరాత్రియే నేను,వారు గయకు ప్రయాణమైతిమి. ఉదయమునకు పాట్నాకు చేరి తిమి.అచ్చట శ్రీమూర్ రాజగోపాలాచారిగారు నాకు కనబడిరిగాని మాపెట్టెలోకి రమ్మని కోరగా తాను ఇంటరుక్లాసున కొందరు అనుచరులతో ప్రయాణము చేయుచున్నందున గయలో కలుసుకొందుమని చెప్పి వెళ్లిరి. సర్ తారకనాథ్ పాలిత్ గారి అల్లుడును సుప్రసిద్ధన్యాయవాదియు నగు డులిప్‌సింగు శ్రీమానునకు గయక్లబ్బున బస కుదిర్చెను. మేము క్లబ్బున బసచేయగానే కొన్నిగంటలకు శ్రీమతి

సరోజినీదేవి బసచేయుటకు క్లబ్బునకువచ్చి చేరెను. ఈక్లబ్ కన్న చక్కని ప్రదేశము గయలోలేదు కావున మరికొందరు ప్రముఖులుకూడ క్లబ్బున బసకుదుర్చు కొనిరి.

జనసమ్మర్దము హెచ్చైనందున శ్రీమాౙ్గారు మరొకచోటికి బసను మార్చిరి. కాని తిండికి మాత్రము శ్రీ సరోజినీదేవిగారు మాత్రమేకాక, కే. భాష్యం, వీరితమ్ముడు సంతానము, వీరిభార్య, శ్రీయం. కె. ఆచార్య' శ్రీవి. ఎల్. శాస్త్రి మున్నగు వారు వచ్చుచుండిరి. ఇందరికి భోజనాలు సిద్ధము గావించుటకు శ్రీఅయ్యంగారి వంటమనిషి కస్తూరికి శ్రమకలిగెనుగాని ఇందరికిని సంతృప్తిగా ఆహార పానీయములను సకాలమున సిద్ధముచేయుచుండెను. నాటిరాత్రి శ్రీమాౙ్గారు తన సవరణ తీర్మానమును గూర్చి కాంగ్రెసుమహాసభ ఆవరణమున సభసాగించు టకు నేను, శ్రీవి.ఎల్.శాస్త్రి, శ్రీ నేలనూతుల సుబ్బరా యుడు మున్నగువారు అన్ని ఏర్పాట్లనుగావించి, భోజనమునకై ఇంటికిరాగా,మరల మేముసభకువెళ్లు లోగా శ్రీరాజగోపాలాచారిగారు మ్మేము నిర్దేశిం చిన ప్రదేశమున సభసాగించి శ్రీమాౙ్ తీర్మానమునకు విరుద్ధముగా ఒక తీర్మానము నెగ్గించిరి. ఈసభకు వెళ్లనని మాకు మాటయిచ్చిన శ్రీ సరోజినీదేవి

రాజాజీ సభలో ఉపన్యాసముగూడ గావించెను. తిరువళ్ళూరు మహాసభలో శ్రీ కస్తూరిరంగయ్యంగారు వర్తించినట్లు గయలో శ్రీ సరోజినీదేవి వర్తించుట శ్రీమాన్ గారికేకాక అనేకులకు అసంతృప్తి కలిగించెను. ఎంతజెప్పినను శ్రీమాన్ వినక తనసభను సాగింపక బసలో నిద్రించిరి.

గయ కాంగ్రెసు సమావేశమైన పిదప కాంగ్రెసున రెండు కక్షలేర్పడెను. శాసనసభలను కాంగ్రెసు బహిష్కరింప వలెనను కక్షకు శ్రీ రాజగోపాలాచారిగారు నాయకులైరి. శాసనసభలలో కాంగ్రెసు వారు ప్రవేశించి కార్యక్రమము సాధనచేయుటయే విధియని తలచిన స్వరాజ్యకక్షకు శ్రీ సి. ఆర్. దాసుగారు నాయకులుగా గణింపఁబడిరి. తొమ్మిది మాసములు ఈ రెండుకక్షలును దేశమంతట వారి సిద్ధాంతములకై ప్రచారము సాగించిరిగాని ఆమీాద ఉభయ కక్షలలోనివారు ఒకమోస్తరు రాజీ గావించుకొనిరి. మతసంబంధమైన ఆక్షేపణయో వారి అంతరాత్మయో అడ్డముతగలనిచో ఇష్టమున్నవారు శాసనసభలను కాంగ్రెసుపక్షమున ప్రవేశింప వచ్చునని పై రాజీ సూచించెను.

చెన్నపట్టణము రాగానే శ్రీమాన్‌గారు మదరాసు కార్పరేషను ఎన్నికలకు కాంగ్రెసు అభ్య

ర్థులనునిలిపి జస్టిసుకక్షును తుదముట్టింపవలెనని వెల్ల డించి కాంగ్రెసు కక్షివారిని కొందరిని మదరాసు కార్పొరేషను ప్రవేశించునట్లుచేసి శ్రీసామివెంకటా చలముశెట్టికి మేయరుపదవి లభించునట్లు చేసిరి. కార్పొరేషను ఎన్నికకు నిలువఁబెట్టిన 10 మందిలో 7 గురుమాత్రమే ఈఎన్నికలో జయమొందిరి. అదిమొదలు శ్రీమాౘగారు కార్పొరేషను వ్యవ హారములలో పూర్తిగా జోక్యము కలిగించుకొని తనఅభిప్రాయమును అనుచరులద్వారా ఆచరణలో పెట్టుచుండిరి. శ్రీ సి. ఆర్. దాసు గారు అప్పటికి ముందే కలకత్తా కార్పొరేషను తనస్వాధీనము గావించుకొనిరి. కాంగ్రెసు కక్షివారికి మదరాసు రాష్ట్రమున ప్రాముఖ్యత కుదిర్చినమీాదట ఢిల్లీ అసెంబ్లీకి ఎన్నికలకై శ్రీమాౘ అయ్యంగారే గాక కాంగ్రెసుకక్షివారనేకులు రేయుంబవళ్లు పాటుపడిరి. మదరాసునందే కాక పై జిల్లాలలోగూడ ఎన్న డునులేని ఉత్సాహము జనించునట్లు శ్రీమాౘ గారు ప్రచారము సాగించిరి. ఈఅసెంబ్లీ ఎన్నికలలో స్వరాజ్యకక్షివారు ప్రముఖ మితవాదులగు డాక్టరు సర్ శ్రీపరంజపై, సర్ శ్రీ సి. వై. చింతా

మణి, సర్ శ్రీసురేంద్రనాథ బెనర్జి మున్నగువారిని ఓడించిరి గావున స్వరాజ్య కక్షివా రన్నిచోట్లలోను ప్రాముఖ్యత చెందవీలాయెను. మదరాసు రాష్ట్రమున జస్టిసుకక్షి ప్రముఖులగు శ్రీ పానగల్లురాజా, సర్ ఎ. పి. పాత్రో, సర్ శ్రీ శివజ్ఞానము మున్నగువారందరు రాష్ట్రశాసనసభ ఎన్నికలలో అపజయ మొందిరి. శ్రీ ముత్తురంగ మొదలారి, శ్రీ సత్యమూర్తి, శ్రీ కె. భాష్యం మున్నగువారు గెలుపొందిరి. శ్రీమాన్ అయ్యంగారు అభ్యర్థిగ నిలచి ఢిల్లీ అసెంబ్లీసభ్యులైరి. ఈఎన్నికల ప్రచారము శ్రీమాన్ నాయకత్వమున సాగునపుడు వీరి సంచారమున రోజూ ఉపన్యాసములును, అనేకచోట్లలో సభలు సాగించినందుచే వీరికి తీరికయే లేకయుండెను. ప్రతికూల కక్షివారనేకులు వీరిని తూలనాడిరి గాని వీరు నిర్లక్ష్యముగ నుండిరి.

చెన్నపట్టణమున ఉన్నప్పుడు ఉదయము బయటికి బయలుదేరినచో రాత్రి 11, 12 గంటలకు మరల ఇంటికి వచ్చెడివారు. ఇంటికిరాగానే ఇంటివారందరు నిద్రలేక చీకాకుపడుచుందురు. డ్రైవరు, వీరితో కారునవెళ్లిన కాంగ్రెసు అనుచరులు మున్నగువారిని ఇంటివారు ప్రశ్నించి ఏమే

చోట్లలో రాళ్లు విసరిరో, ఎచ్చట అల్లరిసాగెనో మున్నగు వివరములను తెలిసికొనెడివారు. దైవకృప వల్ల ఏలాటి అపాయములేక శ్రీమాగ్ ఇల్లు చేరి నందుకు సంతృప్తిని చెందెడివారు. రాత్రి రేడియో ద్వారా నిరంతరము వీరు అభ్యర్థులకు గావించు సల హాలవల్ల ఎంతయో నెమ్మదియైన పరిస్థితి ఏర్పడెను. మదరాసు నగరమున జస్టిసు కక్షను తుదముట్టించు టకు వీరు కనఁబఱచిన పట్టుదల, శ్రద్ధ ఎవరును చూప రైరి. దానివలన వీరు ప్రవేశించని వీధిగాని, సందు గాని, ఇల్లుగాని లేనందున జస్టిసు కక్షవారు వ్యక్తి దూషణకు ప్రాముఖ్యత నివ్వసాగిరి. దాదాపు 20 సం॥లకుపైగా బ్రిటిషు అధికారులదయకు పాత్రు లైన జస్టిసు ప్రముఖులు మూలబడిరి. ఒకరోజున చెంగల్పట్టుజిల్లా ఎన్నికల ప్రచారమునకై ఉదయము బయలుదేరి వెళ్లి రాత్రి 12గంటలకు బంగాళా వచ్చి చేరిరి. చెంగల్పట్టు సమీపమునందలి చెరువుమీద కారువెళ్లుచుండగా దుండగులు కొందరు అచ్చ టచ్చట బాటలందు కొన్ని చెట్లను పడవేయుటయే గాక ఒక ఇరుకు ప్రదేశమున కఱ్ఱతో వీరిని కొట్ట వలయునని యత్నించిరి. ఇది శ్రీమాగ్ గారికి ముందే తెలిసినందున ధీరుఁడగు ముస్లిం డ్రైవరుతో వారు కొట్టుటకురానీ ఒకచేయి చూచుకొందము అని

చెప్పినమీదట డ్రైవరు అతివేగముగ కారును వద లెను. కారుటాపుమీద రాళ్లుపడెనుగాని మరి యే అపాయములేక శ్రీమూర్తిగారు బంగాళా చేరితి. కాంగ్రెసు పనులలో శ్రీ సత్యమూర్తి, శ్రీ రంగస్వామి అయ్యంగారు, శ్రీ కల్యాణసుందర మొదలారి, శ్రీ ముత్తురంగ మొదలారి, జనాబ్ హమీద్ ఖాను, జనాబ్ షాఫీ మహమ్మద్, నేను, జయవేలు శ్రీమూర్తి గారి యింటికి పలుమారు వెళ్లుచుండెడివారము. శ్రీ కల్యాణసుందర మొదలారి జస్టిసుకక్షిలో చేరుటకు నిరాకరించినందున వారిపై శ్రీమూర్తిగారికి అభిమాన ముండెడిదిగాని నావంటివారు శ్రీ మొదలారిగారికి కూడ కొంత బ్రాహ్మణద్వేషము కలదని గుర్తింప గల్గితిమి. శ్రీ మొదలారిగారి అరవభాషయందలి చక్కని పాండిత్యమునకు నేనేగాక శ్రీ సత్యమూర్తి వంటివారుగూడ వారిని ప్రశంసించెడివారేకాని, వారిని నాయకులుగ నెన్నడును పరిగణింపలేదు గావున శ్రీమూర్తిగారు నావర్తనను ఆక్షేపించెడివారు. తామేదైన అరవమున ప్రచురింపవలచినచో శ్రీ అయ్యంగారు శ్రీ కల్యాణసుందర మొదలారిగారిని సవరింపుమని కోరెడివారు. శ్రీ కల్యాణసుందర మొదలారి యెందునకాని పట్టుదలచూపువారు కారు.

తమ పత్రికాప్రచారము గ్రంథవిక్రయము హెచ్చుగుటకు నిరంతరము పాటుబడుచు 'హోంరూలు' రోజులలో శ్రీ సి. పి. రామస్వామిఅయ్యరుగారివద్ద కొన్నివేలు పుచ్చుకొన్నట్లే శ్రీమార్క్ గారివద్ద గొప్ప మొత్తములను పుచ్చుకొనుచుండిరి. వీరిని శ్రీ ఆనిబిసెంటు ఒక కార్మికనాయకునిగావించెనుగాని శ్రీ మొదలారి స్వార్థమువల్ల కార్మిక ఉద్యమము క్రమేణ పాడాయెను. ఈ మొదలారే కమ్యూనిష్టుల పిలిచి శ్రీ వాడియా, శ్రీ అరండేలు మున్నగువారు యెంతో శ్రమపడి నిర్మించిన మదరాసు లేబరు యూనియనును కమ్యూనిష్టులకై వశముగావించిరి.

చాలరోజులు శ్రీమార్క్ గారికి అభిమాన మధికముగనుండెను. అప్పట్లో తనకారును పంపి శ్రీ సత్యమూర్తిగారిని తమ బంగళాకు పిలిపించెడువారు. కొద్దిరోజులలో ఉదయము వెళ్లినకారు 12 గం॥ వరకు తిరిగి రానప్పుడు డ్రైవరును ప్రశ్నింపగా శ్రీసత్యమూర్తిగారు స్నానముచేసి, తిండితిని బయలుదేరి వచ్చినందుచే ఆలస్యమాయెనని చెప్పెడివారు. కారు దిగగానే శ్రీసత్యమూర్తి శ్రీమార్క్ గారిని సమీపించి 'అయ్యా! నన్నేల పిలిపించితిరి' అని అడిగెడువారు. అందుకు శ్రీమార్క్ 'మన డివిజన్‌లో మనకు ఓట్లురావని వినుచున్నాను.

ఓట్లన్నియు జస్టిసు కక్షివారికే లభించునని కొందరు చెప్పుచున్నారు. ఇందుకు ప్రతీకారముగ మనము ఏదైన కృషిసాగింపనిచో ఏమియు ప్రయోజనము లేదని అనెడివారు. 'శ్రీనివాసయ్యంగారూ, ఎందుకు మీరు భయపడుచున్నారు? జస్టిసుకక్షి తుడుచుకొనిపోవుట నిజము. వీరు వారు చెప్పు మాటలను తాము వినక ఫలితమును ఎదురుచూడగోరి తిని. ఇదే నాసలహా' అని శ్రీ సత్యమూర్తి చెప్పెడి వారు. ఈ మాటలను వినగానే శ్రీమాన్‌గారు సంతృప్తిచెంది 'అయినను మనము అశ్రద్ధగనుండ రాదు. చేయదగినప్రయత్నము లన్నిటిని సాధించిన గాని కొంతకాలము అధికారముననున్న కక్షివారిని పడగొట్టుటకు వీలుకాదు.' అని చెప్పెడువారు. శ్రీ సత్యమూర్తిగార్లు ఇంగ్లాండున రాజకీయ ప్రచారము జయప్రదముగ సాగించి చెన్నపట్టణ మునకు రాగానే వారి గౌరవార్థము నేను సౌందర్య మహాలులో ఒక మహాసభను సాగింపదలచి శ్రీమాన్‌గారిని ఆ సభకు అధ్యక్షులుగ నుండుడని కోరితిని కాని మొదలు వీరు అంగీకరించక ఆమీద సభకువచ్చుటకు సమ్మతించిరి. సభ 5 గంటలకు ప్రారంభమగునని ప్రకటింపబడినందుచే వేలకుపైగా

జనము హాలులోను, రెండుమూడువేలమంది ప్రజలు బయటను కూడియుండుటనుజూచి కారుమీద హైకోర్టుకు వెళ్లగా శ్రీమార్ష కోర్టున ఒకకేసు పూర్తిగావించుకొని 2 గంటల మొదలు కోర్టున ఒక కేసున వాదించుచుంటిననియు, బడలికగా నున్నాననియు, సభకువచ్చుట కష్టమనియు చెప్పిరికాని నా ప్రోత్సాహమువల్ల సభకువచ్చి నాపరువును దక్కించిరి. వీథిన వేలకొలదిజనము మూగియుండుటనుజూచి, అందరు బయటనున్నప్పుడు హాలులోని కొందరికిమాత్రము వినునట్లు సభాక్రమముసాగుట వారికి మనస్కరింపక యుండెను. కాని సభను ప్రారంభించి, చక్కని యుపన్యాసముసాగించి, ఇతరులెవ్వరిచేతను చేయసాధ్యము కాని పనులను నిర్వహించుశక్తి శ్రీ సత్యమూర్తిగారికి కలదనియు, ధైర్యముగ చక్కని యుపన్యాసములను గావించుట వీరి కలవాటనియు, ఆంగ్లమునందేగాక అరవమున గూడ ఎన్నియో సభలలో వీ రుపన్యసించియున్నారనియు, వీరి యుపన్యాసముల విన్నవారు ఇంగ్లాండున వీరిని అభినందించుచున్నారనియు శ్రీమార్షగారు చెప్పిరి. చివర శ్రీ సత్యమూర్తిగా రుపన్యసించుచు తన కృతజ్ఞతను వెలిబుచ్చుచు శ్రీమార్షగారికి తాను శిష్యుడనియు, తనకు వా రెంతోసహాయము అనేక

సందర్భములలో గావించిరనియు చెప్పినమీదట సభా ధ్యక్షుల వందనములతో సభ ముగిసెను.

## స్వ రా జ్య పా ర్టీ

శ్రీ చిత్తరంజనదాసుగారు చెన్నపట్టణమువచ్చి కొంత ప్రచారము సాగించినమీదట శ్రీ ఏ. రంగ స్వామిఅయ్యంగారు, శ్రీ యస్. సత్యమూర్తి, శ్రీ వేమ వరపు రామదాసుపంతులు మున్నగువారు బైటిజిల్లా లలో స్వరాజ్యకక్షకై ప్రచారము సాగించిరి. నేను దక్షిణ ఆర్కాటు, నెల్లూరుజిల్లాలకు శ్రీ దాసుగారిని తీసికొనివెళ్లితిని. కడలూరు, విళుప్పురము, చెంగల్పట్టు, గూడూరు, నెల్లూరు మున్నగుచోట్లలో శ్రీ దాసుగారు గావించిన గంభీరోపన్యాసములను విన్న వేలకొలది ప్రజలలో కొంత సంచలనమేర్పడి అనేకులు స్వరాజ్యకక్షలోచేరి ఎన్నికలలో పాల్గొను టకు నిశ్చయించుకొనిరి. ఎన్నికలలో ఈ స్వరాజ్య కక్షవారికి మద్రాసు శాసనసభలో మెజారిటీ లభింప లేదుగాని కొన్నిస్థానములు వీరి యనధీనమాయెను. అప్పట్లో కాంగ్రెసు వ్యవహారములను నిర్వహించు చుండిన శ్రీమాన్ యస్. శ్రీనివాసఅయ్యంగారు స్వరాజ్యకక్షలోచేరుటకు వీలుకాదని చెప్పిరి. శ్రీ ముత్తురంగమొదలారి హమీద్ ఖాను శ్రీస్వామి

వెంకటాచలంశెట్టి మున్నగు అనుచరులతో వ్యవహరించెడివారు. వీరందరును శ్రీమాక్‌గారి సహాయమున జస్టిసుకక్షివారిని ఓడించి మదరాసు కార్పరేషనున ప్రవేశించియుండిరి. దీనికిముందే కార్పరేషను సభ్యులైన శ్రీసత్యమూర్తిగారికున్న వాగ్ధోరణి, అనుభవము, వాదనైపుణ్యము వీరికి లేనందున శ్రీసత్యమూర్తిగారే కార్పరేషన్ కాంగ్రెసు పార్టీకి నాయకులైరి. అందుకై పై శ్రీ మొదలారి, శెట్టి మున్నగువారికి శ్రీ సత్యమూర్తిపై అసూయ జనించి ప్రతిరోజు శ్రీమాక్‌గారిని సందర్శించుచు శ్రీ సత్యమూర్తిపై నిందల నారోపించుచుండెడివారు. ఈ కారణమువల్ల శ్రీమాక్‌గారి మనస్సున మార్పు జనించి శ్రీ సత్యమూర్తిగారిని నిరసింప ప్రారంభించిరి. శ్రీ సత్యమూర్తిగారు ఢిల్లీ అసెంబ్లీ సభ్యులైనమీదట శ్రీమాక్‌గారికిని శ్రీ సత్యమూర్తికిని వైషమ్యములు హెచ్చాయెను. ఇందుకుకూడ ఢిల్లీ అసెంబ్లీసభ్యుడైన శ్రీ ముత్తురంగ మొదలారి శ్రీ వెంకటాచల శెట్టిగార లే ముఖ్యకారకులని నిష్కర్షగ చెప్పగలము. బ్రాహ్మణులపై జస్టిసు పార్టీకున్న నిరసనభావము కాంగ్రెసునందలి బ్రాహ్మణేతరులలో కలదు కావుననే నాటిమొదలు నేటి వరకు కాంగ్రెసున ఎన్నియోకలతలు ఏర్పడియున్నవి.

శ్రీమార్‌గారు అనుచరులందరిలోను శ్రీ ముత్తు రంగ మొదలారిపై అభిమానము హెచ్చుగ కనబరచుచుండిరి. వీరొకరే చివరవరకు విశ్వాసముతో వర్తించిరని తలచుచు శ్రీమార్ కాంగ్రెసును వదలినప్పుడు వీరి పదవులను కొన్నిటిని వారికి లభింప జేసినందుచే అ ర వ రా ప్ర కాంగ్రెసుకమిటీకి శ్రీ మొదలారి అధ్యక్షులైరి.

మదరాసు క్రిస్టియనుకాలేజీలో చాలకాలము ఇంగ్లీషు ట్యూటరుగ నుండినవారును జస్టిసుకక్షులో ప్రముఖులగు శ్రీ ఓ. ధనికాచలముచెట్టి సోదరులును అగు శ్రీ ఓ. కందస్వామిచెట్టి మదరాసు హిందూ సాంఘిక సంస్కరణసభకు కార్యదర్శిగ నున్నప్పుడు శ్రీమార్‌గారి దగ్గరకు పలుమారు వచ్చుచుండెను. ఆమీదట కొన్నిరోజులకు కాలేజీ నౌకరి వదలిన మీదట శ్రీ కందస్వామి మదరాసు కార్పొరేషను ఎన్నికలలో పాల్గొనదలచి శ్రీ అయ్యంగారిని ఆశ్రయించి కాంగ్రెసు అభ్యర్థిగ నిలబడెను. ఇందుకు ముందే శ్రీ కందస్వామి జస్టిసుకక్షువదలి కాంగ్రెసున జేరినందుకు జస్టిసుకక్షునాయకులు శ్రీ కందస్వామిని దూషించిరని హైకోర్టున నొక పరువునష్ట దావాను శ్రీ పానగల్లురాజాపై దాఖలు చేసిరి. ఈ కేసువిచారణ సక్రమముగా సాగుటకు

శ్రీమార్క గారు సహాయపడిరి. కాని జడ్జి ఒక్కదమ్మిడీ జుల్మానా విధించెను. ఆ దమ్మిడీని కందస్వామికి పరిహారముగ నివ్వమని చెప్పెను. ఆమీద కార్పరేషను ఎన్నికలలో ప్రచారమునకై ఏయింటికి శ్రీ కందస్వామివెళ్లినను ఒకదమ్మిడీ శెట్టిగారు వచ్చిరని కేకలువేసి వారికి వోట్లు యివ్వవద్దనిరి. ఈ ఎన్నికలలో శ్రీ వి. ఎల్. శాస్త్రిగారికి ప్రచారము సాగించినందుకు గిట్టని దుండగులెవరో కఱ్ఱలతో బాదిరి. ఈ ఎన్నికలనాడు జస్టిసుకక్షి అల్లరివల్ల శ్రీ కందస్వామిగారికి ఓటు ఇవ్వదలచెడివారు గూడ పోలింగుస్టేషనుకు వెళ్లుటగూడ కష్టమాయెను. కావున వీరు అపజయమొందిరి. అనేకులు శ్రీమార్క గారివద్ద ద్రవ్యసహాయము పుచ్చుకొనువారు. శ్రీ కందస్వామివలె సొమ్ము లాగుకొనువారు మరొకరు లేరని అనేకులు భావించుచుండిరి. వీరికి తంబుశెట్టి వీథిలో ఇల్లుగలదుగాని ఆరోగ్యమునకై సెంటు థామస్ మౌంటున ఒక ఇంటిని నిర్మించుకొని చెన్నపట్టణపు ఇంటిని అద్దెకిచ్చి మౌంటు ఇంటిలో వాసముండెడివారు. తాజెడ్డకోతి వనమెల్ల జెరచెనను లోకోక్తి ప్రకారము శ్రీమార్కగారిని ప్రోత్సహించి, మౌంటులో తన యింటిసమీపమున నొక బంగళా నిర్మించుకొనునట్లుచేసిరి. ఈబంగళాలో శ్రీ అయ్యం

గారు పదిరోజులుండినట్లు తోచదు. శ్రీ టి. ఆర్. వెంకట్రామశాస్త్రి జబ్బుగనున్నపుడు ఈ బంగళాలో నుండగా ఒకమారు వారిని నేను సందర్శించినప్పుడు నెందుకు ఈ బంగళాను శ్రీమాన్‌గారు నిర్మించిరని నాలో నేను ప్రశ్నించుకొంటిని. శ్రీమాన్‌గారికి సంగీతమున అభిరుచి లేకున్నను శ్రీ సుబ్రహ్మణ్య భారతిపాటలను అప్పుడప్పుడు వినుటవల్ల అరవపాట లపై మోజు ఏర్పడెను. ముఖ్యముగా దేశీయగీతము లను (భారతిగారివి) యెవరైన పాడినచో వారిని అభి నందించెడివారు. జస్టిసుకక్షివారు అధికారమున యున్నపుడు శ్రీసుబ్రహ్మణ్యభారతిగారి పుస్తకములను వెలివేసిరి. అప్పుడు మదరాసు శాసనసభలో కాంగ్రెసు కక్షివారు కొద్దిమందే సభ్యులుగనుండిరి. కాని వీరిలో ప్రముఖులును అనుచరులును అగు శ్రీ సత్యమూర్తిని ఒక నిరసన తీర్మానము ప్రతిపా దింపుమని తానే తీర్మానము వ్రాసియిచ్చి, ఎన్నడును శాసనసభకు వెళ్లని శ్రీమాన్‌గారు ఈ తీర్మాన ప్రతి పాద నప్పుడు అసెంబ్లీన అధ్యక్షుని పీఠముక్రింద ప్రభుత్వోద్యోగులు కూర్చొనుచోట ఆసీనులైరి. సభ ప్రారంభమయి ప్రశ్నోత్తరములు పూర్తి కాగానే అధ్యక్షులు శ్రీ సత్యమూర్తిగారిని తీర్మాన

మును ప్రతిపాదింపుమని కోరిరి. శ్రీసత్యమూర్తిగారు లేచి, తన నాయకులేగాక భారతదేశీయమహాసభ నాయకులలో ప్రముఖులైన శ్రీమాన్ యస్. శ్రీనివాసఅయ్యంగారి సమక్షమున తాను నీ తీర్మానమును ప్రతిపాదించి, దీనిపై మాట్లాడుటవల్ల తన కెన్నడు లేని గౌరవము లభించెనని చెప్పుచు గంటసేపు జడివాన కురిపించిరి. జస్టిసు పక్షనాయకులు శ్రీ పానగల్లు రాజాగారిని ఉపన్యాసమున శ్రీమాన్ తూలనాడెనని శ్రీ ఎ. రామస్వామి మొదలియారు లేచి బుకాయించెను. కాని శ్రీ సత్యమూర్తిగారు వెంటనే శ్రీమాన్‌గారి కాలి బూడ్సును తుడుచుటకు గూడ తాహత్తులేనివారు మంత్రులగుట దేశ దౌర్భాగ్యమును సూచించుచున్నదని చెప్పెరి. ఈ తీర్మానమును జస్టిసు కక్షవారు ఓడించిరి కాని, దీని ఫలితముగ ముందు ఎన్నికలలో అనేకస్థానములను కోల్పోయిరనుట నిర్వివాదాంశము. ఎన్నికలప్పుడు శ్రీమాన్‌గారి కుమారుడేగాక కుమార్తె శ్రీ అంబుజమ్మాళ్ కొంత ప్రచారము సాగించిరి. పైకి కనబడకుండ శ్రీ పార్థసారథి (శ్రీమాన్ కుమారుడు) ఎన్నో పనులను నిర్వర్తించుచుండెను. ఈ ఎన్నికలన్నిటిలోను కాంగ్రెసు అభ్యర్థులు జయమొందిరని ఇదివరకే చెప్పియుంటిని. 1925 సం॥న గాంధీగారు

మదరాసునకు వచ్చుట తటస్థించెను. అప్పుడు 3 రోజులు శ్రీమాకా బంగళాయందు బసపెట్టుకొనిరి. ఒకరోజు సాయంత్రము శ్రీమాకాగారి భార్యను పిలచి అడ్వొకేటు జనరలుపదవిని తమ భర్తగారు వదలిపెట్టినందుకు మీకు విచారము కలుగలేదా అని ప్రశ్నించిరి. అందుకు శ్రీమాకాగారి భార్య ఇప్పుడు మాత్రము నాభర్త దర్జాకు ఏలోపము ఉన్నట్లు నాకు కనబడదు అని చెప్పిరి. కాంగ్రెసు సేవకులు నాభర్తగారికి రాజోపచారములు గావించుచు వీరిని ఒక ప్రభువుగ భావించు చున్నందున ఎవరికిని ఏవిచారము లేదని చెప్పిన మీదట గాంధీగారు నవ్విరి. గాంధీగారు ఇంటిలోపలి హాలులో ఉన్నపుడు దొడ్డిత్రోవలో కొందరు వారిని సందర్శించుటకు వారియొద్దకు వచ్చిరి. శ్రీ గాంధీ గారు నవ్వుచు ముందుహాలున కాపలాగానున్న శ్రీమాకాగారిని కూడ మీరు ఏమార్చి లోపలికి ప్రవేశించితిరా అని వచ్చినవారిని అడిగిరి. దొడ్డిత్రోవన వచ్చినందుకు శ్రీమాకా ఇంటి వారు బాధపడుటనుజూచి శ్రీ గాంధీగారు ఈ బంగళా ఒక ధర్మసత్రముగ కనబడుచున్నపుడు ఎవరు లోపలికి రారని వారిని ఓదార్చిరి. మరొక పర్యాయము చెన్నపట్టణమునకువచ్చి, శ్రీమాకా

బంగళాన బసచేసినపుడు శ్రీమాన్‌గారితో 'ప్రథమ మున నేను మీ ఇంటివాకిలి గదిలో నుంటిని. రెండవపర్యాయము నేను ఇచ్చటికి వచ్చినపుడు లోపలి హాలునకు వెళ్లితిని. మూడవ పర్యాయము నేను వచ్చినపుడు నాభార్యను వంట ఇంటికే తీసికొని వెళ్లితిని. కావున పిలువ క్రమేణ ఏర్పడిన దని తలచుచున్నాను' అనిరి. శ్రీ గాంధీ శ్రీమానుల మధ్య అభిప్రాయభేదములు గలవుకాని శ్రీగాంధీ గారిపై శ్రీమాన్‌గారికి ఒకమోస్తరు గౌరవముండె డిది. కావుననే అప్పుడప్పుడు వారి గుణాతిశయము లను గూర్చి ఇంటికివచ్చినవారితో ముచ్చటించెడి వారు. శ్రీ గాంధీగారు తమయింట బసచేసినపుడు శ్రీ గాంధీగారి ప్రక్కన కూర్చొని అన్నిపనులను జూచెడువారు.

జాతీయవాదులు యెవరుగాని కారాగారములను ప్రవేశించుట పనికిమాలినపని అని శ్రీమాన్‌గారు అభిప్రాయపడుచుండెడివారు. తాను కావలెనని కారాగారప్రవేశము ఎన్నడును కోరననియు, అధి కారులు పట్టుబట్టి తన్ను నిర్బంధించినచో విధిలేక కారాగారమున నుందుననియు, తన కెన్నడును కారాగారభయము లేదనియు చెప్పెడివారు.

సైమనుకమీషను మదరాసుకు వచ్చినపుడు ఏర్పడిన అల్లరులు చరిత్రాత్మకములైనవి గాన ఆ అల్లరుల వివరములగూర్చి వ్రాయుట అనవసరమని తలచుచున్నాను. కమీషనువచ్చినరోజున శ్రీమాన్ ఒక నల్లజెండాను చేతబట్టుకొని కాంగ్రెసు సేవకులతోను వాలంటీర్లతోను ఒక ఊరేగింపు సాగించిరి. వీరు అనవసరముగా నెవరినిగాని నిర్బంధింప యత్నింపరుకాని ప్రజలు ఉత్సాహపూరితులైనందున అల్లరిజనించి రాళ్లు విసరిరి. 'లాటీచార్జి సాగినచో తా నెంతమాత్రము ఈ సంభవమును చూచువాడను కాను. ఊరేగింపును అధికారులు అడ్డగింతురు కావున ప్రజలందరును నెమ్మదిగా, కేకలువేయక తన వెంబడి రావలెనని ఆదేశించిరి. కాని ఏమి తటస్థించునో అని అందరును భయపడిరి. మెరీనా సమీపమున యూనివర్సిటీభవనముల దగ్గరనున్న వాకధిమీదుగా ఊరేగింపు వెళ్లుచున్నపుడు సాయుధపోలీసులు అడ్డపడి అందరిని వెనుకకు వెళ్లిపొమ్మని కోరిరి. కల్లకపటములు శ్రీమానునందు ఇసుమంతయు కనబడవు గాన ఇంటిలోగాని సభలోగాని ఏమాటలు పల్కుచుందురో వానినే పోలీసు అధికారులయెదుట పల్కిరి. కోపిష్ఠి గావున మండిపడుచు వీరు చెప్పినమాటలు పోలీసు అధికారుల

మనస్సులనుగూడ కలవరపెట్టెను. మిత్రుడును విరోధి, ధనవంతుడు బీద అనుభేదములు వీరు పాటింప లేదు. మనస్సున తలచినదానిని చెప్పినమీదటనే వీరి కోపము తగ్గును. కాశీవిశ్వవిద్యాలయమునకును, మదరాసు విశ్వవిద్యాలయమునకును, రామనాథ పురమునందలి లైబ్రరీ మున్నగువానికిని వీ రిచ్చిన విరాళములగూర్చి చెప్పియుంటిని. తెనుగుదేశము నుండి కాంగ్రెసుకు సంబంధించినవారు ఎవరైనను వీరివద్దకువచ్చి సహాయము కోరినచో వెంటనే గావించెడువారు. మహర్షి శ్రీ బులుసు సాంబమూర్తి, శ్రీమద్దూరి అన్నపూర్ణయ్యగార్లకు వారు కోరినపు డెల్ల గొప్పమొత్తముల నిచ్చిరి. శ్రీదుగ్గిరాల గోపాలకృష్ణయ్య చీరాల సత్యాగ్రహము సాగించు నపుడు నాద్వారా వారికి వేయిరూపాయలు ముట్ట జెప్పిరి. శ్రీ ప్రకాశముగారి స్వరాజ్య పత్రిక ఇబ్బందులకు లోనై చిక్కుపడుచున్నప్పుడు నేను 10 వేలు అప్పుగ నిప్పించితినిగాని ఈమొత్తమును స్వరాజ్యకంపెనీవారు తిరిగి వారి కివ్వరైరి.

శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి బందరు జాతీయకళాశాలకు ఏటా గొప్పవిరాళము ఇచ్చుచుండిరి. శ్రీ తెన్నేటి సత్యనారాయణగారు

రాజమండ్రిలో శ్రీ విక్రమహాలునకు సహాయము కోరగా 2 వేలుఇచ్చి శ్రీ అణ్ణామలశెట్టిగారిచే 3 వేలు ఇప్పించిరి. ఆంధ్రదేశమందలి ఏపత్రికా విలేఖరిగాని సంస్థగాని వీరిని ద్రవ్యసహాయము కోరినచో వెంటనే వారికోరికలను సఫలము గావించు చుండిరి. కాంగ్రెసు సమావేశములకు వెళ్లు కాంగ్రెసు డెలిగేట్లు కొందరికి రైలుఖర్చులకు సొమ్ము నివ్వుమని కోరినపుడెల్ల నిరాఘాటముగ చెక్కువ్రాసి ఇచ్చు చుండిరి. వీరు కాంగ్రెసున ప్రవేశించినందున వీరి ఆదాయము తగ్గెనే కాని వీరి దానధర్మములు హెచ్చాయెను. అయిదారు సంవత్సరములలో రెండులక్షలు ఖర్చుబెట్టిరని వీరికుటుంబీకులు చెప్పగా అనేకులు ఆశ్చర్యపడిరి. శ్రీ పట్టాభి సీతారామయ్య వంటివారు వీరి డబ్బును లాగికొన చూచుచుండిరే. కాని కాంగ్రెసు వ్యవహారములలో శ్రీగాంధీగారినే అనుసరించుచుండిరి కావున, వారితోనేగాక మరి కొందరు తెనుగువారితో తమ యభిప్రాయములను చెప్పెడువారు కారు. వాగ్ధోరణిలో కొన్నిమాటల వల్ల వీరియూహా లిట్టివని వారు తెలిసికొన వలెనేగాని నిశ్చితాభిప్రాయములను గుర్తింపరైరి. వీరి ఆఖరిదశలో శ్రీ న్యాయపతి సుబ్బారావు పంతులు, శ్రీ మోచర్ల రామచంద్రరావుపంతులు,

శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య, శ్రీ వేమవరపు రామదాసు, బారిష్టరు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ మున్నగువారు వీరి నిజస్వభావమును గుర్తించి వీరిని సత్కరించిన సందర్భము లనేకములు నాకు తెలియును గావున ఈసందర్భమున వెల్లడించుచున్నాను.

## సైమను కమీషను

ఈసందర్భమున ఆంధ్రదేశమందలి రాజకీయ వేత్తల చర్యలగూర్చి కొంత చెప్పదలచితిని. వీరిలో ప్రముఖులగు శ్రీ బులుసు సాంబమూర్తిగారు సైమను కమీషను బహిష్కారప్రయత్నమున చెన్నపట్టణమున అల్లరిసాగింపదలచిరని అధికారులకు దెలిసెను. కలకత్తా గుంటూరుపట్టణములలో వీరు తీవ్ర ఉపన్యాసములను సాగించిరని బ్రిటిషు అధికారులు తలచినందున మదరాసునకు వీరు తమ అనుచరులతో వచ్చుచుండగా బెజవాడ రైలుస్టేషనున వీరిని పోలీసులు అరెస్టుచేసి బందరునకు తీసికొనివెళ్లి నెలరోజులు రిమాండున ఉంచిరి. ఇందుచే మూలబడియున్న శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య జీవితమున మరొక రాజకీయపరివర్తనము ఏర్పడెను. శ్రీసాంబమూర్తిగారిని కేసువిచారణకై బందరున సబ్

జైలున యుంచిరి కావున నాడుబందరు తెనుఁగు దేశ మందలి సంపూర్ణస్వాతంత్ర్యవాదులకు తీర్థయాత్రా స్థలమయ్యెను. అప్పటివరకు 'పల్లికికూడ భిక్షము పెట్టని ఈ పట్టాభి' అని అనేకులు భావించుచుండిరి. కాని యిప్పుడు విధిలేక తీర్థయాత్రికులకు ఆతిథ్యము ఒసఁగఁదలఁచి వచ్చెను. బందరున రోజూ సాగుచుండిన సభలకు శ్రీపట్టాభిగారు అధ్యక్షతవహించి పిన్నల పెద్దల సభవారికి నెరుకపఱచుచుండిరి. అప్పుడు శ్రీసాంబమూర్తిగారు కారాగారము ప్రవేశింప గానే వీ రాక్రమించియున్న రెండుస్థానములు అనగా, ఆంధ్రరాష్ట్రకమిటీ అధ్యక్షత, అఖిలభారత వర్కింగు కమిటీ సభ్యత్వము, శ్రీపట్టాభిగారికి సంక్రమించి 'దేవుఁడా' అని సంపూర్ణస్వాతంత్ర్యప్రచారము సాగింపవలసివచ్చెను. 1928 సం॥న పైసంభవములు జరిగెను. సైమనుకమీషను బహిష్కారప్రచారము కాంగ్రెసు కక్షవారు సాగింతురని యధికారులు 144 వ సెక్షను క్రి. ప్రొ. అమలునఁబెట్టిరి. ఆంధ్ర, అరవరాష్ట్రకమిటీలు సంయుక్తసమావేశమొనర్చి శ్రీమార్కాగారి సలహామీఁద సాధకబాధకములు ఆలోచించుకొని, అవసర మేర్పడినచో పైసెక్షనును ఉల్లంఘింప మని అఖిల కాంగ్రెసుకమిటీ సలహా

గావించెను. ఆంధ్రకమిటీ నిర్వాహకవర్గము బెజవాడలో సమావేశమై 144 వ సెక్షను నుల్లంఘింప తీర్మానించెను. సొంతకారణములవల్ల ఉల్లంఘనము సాగింపలేనివారు రాజీనామా లివ్వవలెనని ఉల్లంఘనమునకు సంసిద్ధులైనవారే ముందుకు వచ్చి చర్య పూనవలెననియు తాఖీదు వచ్చెను. కాని ఉల్లంఘనమునకు సంసిద్ధుండనని చెప్పి శ్రీపట్టాభి చెన్నపట్టణమునకు వచ్చెనుగాని అందుకు ముందురోజుననే అనపకమిటీ సమావేశమై అధ్యక్షుని కాస్టింగు వోటుతో 144 వ సెక్షను ఉల్లంఘింపరాదనే తీర్మానము శ్రీ పట్టాభిగారు తెలిసికొనిరి. వీరేల ముందు రోజు సభకు రాలేదో వారికి తప్ప ఇతరులకు తెలియదని శ్రీకొండా వెంకటప్పయ్య మొరపెట్టెను. 1929 సం॥ పై సంఘటన యేర్పడినయెడల కాంగ్రెసు జాతీయవాదు లందరును తప్పక సెక్షను ఉల్లంఘింపవలెనని కలకత్తాకాంగ్రెసు శాసించెను. ఇందుకు ముందే పైతీర్మానమునకు కారకులైన శ్రీ సాంబమూర్తిగారు నిర్బంధింపఁబడినందున తెనుగువారి కిది ఆత్మీయసమస్య ఆయెను. చెన్నపట్టణమున రాజకీయవ్యవహారముల నన్నిటిని శ్రీమాన్ ఎస్. శ్రీనివాసఅయ్యంగారు ముఖతః సాగించుచుండిరి. తెనుగుదేశమందలి ప్రముఖు లనేకులు నాడు తమ

బలగముతో చెన్నపట్టణమున గుమిగూడిరి. వీరిలో శ్రీపట్టాభిగారు ఒకరు. ఇంపరు తెలుగువారు చెన్న పట్టణము వచ్చినందున అల్లరు లేర్పడు నని యధి కారులు తలచి ఎందులకును మంచి దని ముందునాటి సాయంకాలమే శ్రీ కొండా వెంకటప్పయ్యను, శ్రీపట్టాభిగారిని మరికొందరిని అరెస్టుచేసిరి. కాని వీరినందరిని రాత్రి 10 గం॥లకు వదలిపెట్టిరి. తెనుగు వారు అనవలకన్న ధైర్యస్థైర్యములుగలవా రని తలచి శ్రీమాన్‌గారికి మనస్సంకటము కొంత కలిగింప గల్గిరేగాని దీనివల్ల ఏప్రయోజనము లేదని ముందు విశదమాయెను.

ఒకరోజున శ్రీమాన్ డ్రాయింగు రూమున కూర్చొని చదువుకొనుచుండగా ఒక బ్రాహ్మణ బాలుఁడు వారిని సమీపించి యేదైన కొంత సహాయము చేయు మని ప్రార్థించెను. శ్రీమాన్ గారు ఆగ్రహపడి బ్రాహ్మణబాలుఁడు బిచ్చమెత్తుట తన కెంతమాత్రము ఇష్టము కా దనియు, తా నే సహాయము కావింప ననియుచెప్పి బయటికి వెళ్లు మనెను. ఆకుఱ్ఱవాఁడు పట్టుదలతో శ్రీమాన్‌నెదుట కొంతసేపు నిలఁబడెను. వానివైపుచూడక శ్రీమాన్ ఏదో ఒక పుస్తకమును చదువుచుండిరి. ఆమీఁద ఆ కుఱ్ఱవానిని ఇంకను ఎందులకై కాచియున్నావు?

నీకు నేను సహాయము చేయనని నీవు రాగానే చెప్పితిని గదా! అనిరి. ఈ పిల్లవాఁడు ఇంగిత జ్ఞానముకలవాఁడు గావున శ్రీమాఁగారికి ఏబఫ్లు చెప్పక నిలఁబడిన మీఁదట 5 రూపాయనోటు నిచ్చి పంపివేసిరి. ఇంటివారు ఈకుఱ్ఱవాని 4,5 గంటలు కాచునట్లు చేసినందుకు విచారపడిరి కాని శ్రీమాఁ ఎదుట ఏదియు చెప్పరైరి. వారి అభిప్రాయములకు విరుద్ధముగ ఎవరేది చెప్పినను సహించువారు కారు. వెంటనే కండ్లు ఎఱ్ఱచేసికొని పెద్దగొంతుతో చీవాట్లు పెట్టుదురు కావున, ఎవరును వారిని ఎందును ఎదుర్కొనెడువారుకారు. కుమార్తె శ్రీమతి అంబుజమ్మాళ్ కారాగారము ప్రవేశించుట వీరి కెంతమాత్రము నచ్చ లేదు. కుమార్తె శాసనో ల్లంఘనము గావింప తలచితినని తండ్రితో చెప్పగానే వీరికి అపరిమితకోపము వచ్చెను. నీ యంతరాత్మ జైలు ప్రవేశింపు మని సూచించినచో అట్లే చేయ వచ్చును గాని ఇతరుల ప్రోత్సాహముగాని నలుగురి మన్ననలకు పాత్రమగుటకుఁగాని నీవు జైలునకువెళ్ల ప్రయత్నింపరాదు. తాను జైలుకు వెళ్లక శ్రీ కె. భాష్యం నీవంటివారిని జైలుకు వెళ్లు మని ప్రోత్సహించుచున్నాఁడని నాకు తెలిసినది

కావున మీ యుభయులవర్తనలు నేను పూర్తిగ గర్హించుచున్నాను అనిరి. అంతటితో తృప్తిచెందక ఎన్నో యితర అంశములనుగూర్చి కుమార్తెతో నాడు ముచ్చటించిరి. స్త్రీలు కుటుంబధర్మమును త్యజించి రాజకీయరంగపోరాటమున పాల్గొన రాదు అనెడి తన దృఢాభిప్రాయమును శ్రీమాన్‌గారు సూచించిరి. వీరు పురుషులవలె తండ్రి ఆస్తికి హక్కు సంపాదించుటలో అభ్యంతరము నా కేదియు కనఁబడదు. పురుషులతో సరిసమానముగ పౌరవౌర సత్వహక్కు లన్నిటిని వీరు సంపాదించుట అవసరమే కాని ఇంటిపనులు మాని తమ బిడ్డలపోషణను ఇతరుల అధీనము కావించి ప్రజాసేవకు ఏస్త్రీగాని దిగుట మన కుటుంబముల పురోభివృద్ధికి ఆటంక మని వీరు భావించెడివారు. భర్తకు సౌకర్యములను గావింపక డబ్బున్న దని నౌకరులచే అన్నిపనులఁ జేయించుట పతిభక్తికానేరదు.

ఈ పై కారణములవల్లనే శ్రీమతి సరోజినిదేవిని, అనిబిసెంటు మున్నగువారిని శ్రీమాన్ తృణప్రాయముగాఁ జూచెడివారు. స్వరాజ్యకక్ష సంస్థాపనకై శ్రీ సి. ఆర్. దాసుగారు మదరాసు రాష్ట్రమునకు వచ్చిరి. శ్రీ సత్యమూర్తి, శ్రీ రంగస్వామిఅయ్యం

గారు మున్నగు అరవప్రముఖులుకొందరు ఒక సభ సాగించి మదరాసురాష్ట్ర స్వరాజ్యకక్షను నిర్మించి ఇందుకు శ్రీసత్యమూర్తిగారిని కార్యదర్శిగ యెన్నుకొనిరి. శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారు తెనుగువారిని కొందరిని ప్రోగుచేసి శ్రీవి. ఎల్. శాస్త్రిని ఆంధ్రశాఖకు కార్యదర్శి గావించిరి. నేను ఈరెండు కమిటీలలోను సభ్యుఁడుగ నున్నట్లు జ్ఞాపకము. దైనికపత్రిక లేనిది కక్ష ప్రచారము విరివిగ సాగదుగావున శ్రీసీ. ఆర్. దాసుగారు ఇందుకై అరవ తెలుగురాష్ట్రములలో కొంతసొమ్ము పోగు కావలె నని చెప్పుచు అరవజిల్లాలకు శ్రీరంగస్వామి అయ్యంగారుఁ, శ్రీసత్యమూర్తిగార్ల వెంటఁబెట్టుకొని ప్రయాణమైరి. ఈప్రయాణమున 20 వేలు శ్రీదాసుగారికి ముట్టుటయు, 10 వేలు విరాళములు పంపుదు మని వాగ్దత్తములుగావించుటయు తటస్థించెను. కాని శ్రీరంగస్వామిఅయ్యంగారు అరవ దిన పత్రిక ఆర్థికచిక్కులవల్ల వసూలుకావలసిన పదివేలును వసూలుచేసి స్వదేశమిత్రపత్రికను చక్కగ సాగింపు మని ఆదేశించిరి. శ్రీమార్ సత్యమూర్తిగారికి న్యాయవాదవృత్తిలో నభిరుచి లేనందున వీరికి సంపాద్యము లేకయుండెను. కొంతకాలము శ్రీమార్గారు వీరికి నెలకు వందరూపాయలు

నిచ్చుచుండిరిగాని శ్రీసత్యమూర్తిగారు తిరునెల్వేలి కాన్ఫరెన్సు ముందురోజున, శ్రీగాంధీగారి సహాయ నిరాకరణమున కనుకూలముగ నుపన్యసించినందుచే శ్రీసత్యమూర్తిగారికి అది మొదలు ఏసహాయమును గావింపరైరి.

అరవస్వరాజ్యకక్షకు శ్రీ సత్యమూర్తిగారిని కార్యదర్శిగ నెన్నుకోబడినందుమీఁదట వీరికి నెలకు 150 రూపాయలు ఇవ్వ మని శ్రీ సి. ఆర్. దాసుగారు చెప్పిరి. కావున శ్రీ సత్యమూర్తిగారు సంతృప్తితో పాటుబడుటకు ప్రారంభించిరి. శ్రీ వి. రామదాసు పంతులుగారికి న్యాయవాదవృత్తిలో మంచి ఆదాయమేగాక గొప్పభూఆదాయముండుటచే సం॥కు భూములవల్ల 10 వేలకుపైగా నికరాదాయ ముండెడిది. ఈ సందర్భమును శ్రీ సి. ఆర్. దాసు తెలిసికొని ఆంధ్ర రాష్ట్ర స్వరాజ్యకక్ష జమాఖర్చుల నన్నిటిని వారే చక్కబెట్టవలె నని ఆదేశించిరి. శ్రీమాఁగారు అప్పట్లో బెంగుళూరునకు వేసవి విశ్రాంతికై వెళ్లిరి కావునను శ్రీ రామదాసు, శ్రీ వి. ఎల్. శాస్త్రి, నేను బయలుదేరి శ్రీ సి. ఆర్. దాసు పత్రికకు కొంతద్రవ్యసహాయము కోరుటయే గాక ఉభయులమధ్య నొక సమావేశము సాగింప నిశ్చయించుకొంటిమిగాని నేను శ్రీ సి. ఆర్. దాసు

గారిని వెంటఁబెట్టుకొని చెంగల్పట్టు, విల్లుపురము కడలూరు వెళ్లి, అచ్చటనుండి శ్రీఅరవిందఘోష్‌గారి ఆశ్రమము చేరితిమి. అచ్చటనుండి చిత్తూరు, వేలూరు మున్నగుచోట్లు జూచుకొని బెంగుళూరు నకు ప్రయాణమగునప్పుడు తంతి నిచ్చెద మని శ్రీరామదాసుగారితోను చెప్పి చెంగల్పట్టు వెళ్లితిమి. మేము వెళ్లినచోట్లలో గొప్ప సభలు సాగుటయు కొంతసొమ్ము పత్రికకు లభించుటయు తటస్థించెను. చిత్తూరున న్యాయవాదిగనుండిన శ్రీఎమ్. రంగస్వామి అయ్యంగారి ఇంటిలో మేము బసచేసి శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారిని మమ్ముల కలుసుకొను మని నేను జాబు వ్రాసితిని. వారు చిత్తూరు క్లబ్బునకు త్వరలో వత్తు మనియు అచ్చట శ్రీసి. ఆర్. దాసుగారి గౌరవార్థము అతిథి సత్కారముగావింప యత్నింతు మనియు ఒక వెండిపళ్లెమునిండ మామిడిపండ్లనుంచి ఒకజాబు వ్రాసిపంపిరి. శ్రీ సి. ఆర్. దాసు, నేను చిత్తూరు మిత్రులు కొందరు క్లబ్బునకు వెళ్లగనే శ్రీ రెడ్డిగారు మిక్కిలి ప్రీతితో శ్రీ సి. ఆర్. దాసు గారిని కారునుండి దింపి క్లబ్బున సుఖాసీనుల గావించి పానీయముల ఫలహారముల వారికి తక్కిన మిత్రు లకు నిచ్చి అందరిని సత్కరించిరి. మిత్రులు కొందరు

టీపార్టీ కాగానే బసలకు వెళ్లిరికాని శ్రీ దాసుగారిని ఒక గదిలోనికి తీసికొనివెళ్లి పత్రికకు తాను హెచ్చుగ సొమ్ము ఇవ్వలేని స్థితిలో నున్నానని రెండువందల రూపాయలనోట్లు మాత్రము నాచేతఁ బెట్టిరి. చిత్తూరు క్లబ్బునుండి నేను శ్రీదాసుగారిని శ్రీ మునుస్వామినాయుడుగారియింటికి తీసికొనివెళ్లగా శ్రీ దాసుగారిని ప్రీతిగౌరవములతో ఫలతాంబూల చందనాదులతో సత్కరించిరి. వచ్చినపనిని శ్రీనాయుడు గారితో చెప్పగ వారు వి.రాళముగ 150 రూపాయలు పత్రికకు నిచ్చిరి. వేంకటగిరిలో వేలకొలది ప్రజలు రైలుకు అడ్డపడి శ్రీదాసుగారిని సభలో నుపన్యసింపుమని మొండిపట్టు పట్టిరికాని ప్రజానీకవర్తనను శ్రీ సి. ఆర్. దాసుగారు గర్హించిరి. అల్లరిహెచ్చి పోలీసులు మే మున్నచోటికి వచ్చి మూకను వెళ్ల గొట్టినమీాదట మేము గూడూరుకు చేరుకొంటిమి. వేంకటగిరి ప్రజలకు శ్రీ రామదాసుగారిపై అనుమానము జనించి వీరే శ్రీ దాసుగారిమనసును మార్చి రని తలచి కాబోలు వీరిపై రాళ్లు విసరిరి.

శ్రీ సీ. ఆర్. రెడ్డిగారు సాయంత్రము సభ ముగియగానే తనబసకు రమ్మని కోరిరి. 6 గం॥ లకు ప్రారంభమైన సభ 9 గం॥ వరకు సాగెను.

కావున మాట తప్పరాదని రెడ్డిగారి బసకు వెళ్లితిమి కాని వారు నిద్రించుచున్నందున మేము వేంకటగిరికి ప్రయాణము సాగించి 3 గం॥లకు గూడూరు చేరితిమి. గూడూరున రాత్రి 3 గం॥ గొప్ప సభను శ్రీ పెళ్లేటి వెంకటసుబ్బారెడ్డిగారు సమావేశపరచి శ్రీదాసుగారిని సభలో ఉపన్యసింపుమని ప్రార్థేయపడిరి. కాని ఉదయము 7 గం॥కు నెల్లూరు సభకు వెళ్లవలసి యున్నందువల్ల వేకువనే బయలుదేరి వెళ్లఁదలచితి మని వారితో చెప్పిన మీఁదట వారుగూడ మాతో నెల్లూరికి వచ్చిరి. వారు 116 రూపాయలు శ్రీ సి. ఆర్. దాసుగారికి నిచ్చిరి. మరికొందరు కొద్దిమొత్తముల మధ్య రాత్రివేళలో శ్రీ సి. ఆర్. దాసుగారిపై గల అభిమానముచే వారికి నిద్రాభంగము గావించి కొద్ది మొత్తముల నిచ్చి గౌరవించిరి. 4 గం॥కు గూడూరు వదలి 6-30 గ॥ నెల్లూరు స్టోనుహావుసుపేటలోని రేబాల వారి భవనమునకు వెళ్లి వాకిట కారు నిలిపి నేను లోపలికి వెళ్లి మిత్రులగు శ్రీ సుందరరామి రెడ్డితో శ్రీ సి. ఆర్. దాసుగారు వచ్చిరనియు వారు అతిథిగ నుందురనియు చెప్పి, నేను, రెడ్డిగారు కారువద్దకువెళ్లి శ్రీ దాసుగారిని దిగఁబెట్టి ఇంటిలో

ప్రవేశించితిమి. వెంటనే శ్రీ సి. ఆర్. దాసుగారు కొంత కాఫీపుచ్చుకొని ఫలహారముల ముట్టకనే 4 కమలాఫలముల నారగించి నెల్లూరు సభకు బయలు దేరిరి. వేసవి కావున 7 గం|| ప్రారంభించిన సభను 9 గం|| పూర్తిగావించి కొంత వసూలైన సొమ్ముతో శ్రీ సుందరరామిరెడ్డిగారి భవనము చేరుకొంటిమి. నేను సి. ఆర్. దాసుకు కావలసిన భోజనపేర్పాట్లు త్వరలో గావింపుమని సుందరరామిరెడ్డిగారితో చెప్పి వీరికారులో మాబావగారగు శ్రీ కాళహస్తి దక్షిణామూర్తిగారింటికి వెళ్లి అచ్చట భోజనముచేసి గంటలోగా సి. ఆర్. దాసు బసలో కలుసుకొంటిమి. నెల్లూరు పురప్రముఖులగు శ్రీ ఆమంచర్ల కృష్ణరావు, శ్రీ ముంగమూరి సుబ్బారావు, శ్రీ టి. వి. శివరామయ్య, శ్రీ ఏనుగ రాఘవరెడ్డి, శ్రీ అణ్ణాస్వామి అయ్యరు, శ్రీ చెంగయ్యపంతులు మున్నగువారికి వార్త పంపగా వీరందరును శ్రీ సి. ఆర్. దాసుగారి బసకు వచ్చి అందరు కొంతసొమ్ము విరాళముగ పోగు చేసి త్వరలో పంపెదమనియు శ్రీ రాఘవరెడ్డిగారు స్థానికపనుల నిర్వహింతురనియు చెప్పినమీదట రేబాల వారి కారులో నేను, శ్రీ దాసుగారు కావలికి ప్రయాణము సాగించితిమి. కాని అచ్చట వెళ్లిన రోజుననే పనిముగించుకొని శ్రీ రామదాసు

గారికి తంతెనంపి వెంటనే బెంగుళూరునకు రమ్మని కోరితిమి. శ్రీ దాసుగారు నేను బెంగుళూరు చేరుటకుముందే వీరు మైసూరు హోటలున బస కుదుర్చుకొనియుండిరి. శ్రీ దాసుగారి స్నానపానాదులకు అచ్చట అవకాశము తక్కువగా నున్నందున, దివాన్ వి. పి. మాధవరావుగారి భవనమునకు వెళ్లి వారి యింట, శ్రీ దాసుగారికి బస కుదిర్చితిని. నేను శ్రీదాసు బెంగుళూరువచ్చిన వర్తమానము శ్రీమాన్ గారికి తెలిసి, మమ్ము వెదకుచు మైసూరు హోటలుకు వచ్చిరి కాని శ్రీ రామదాసుగారు ఆ హోటలున రెండురోజు లుండుట కేర్పాటు కావించుకొనిరి. కావున నేను, శ్రీ వి. ఎల్. శాస్త్రి శ్రీమాన్‌గారి బంగాళాకు కారులో వెళ్లితిమి. శ్రీదాసుగారు యెచ్చట నున్నా రని నన్ను ప్రశ్నింపగా వారికి శ్రీ వి. వి. మాధవరావుగారితో బస కుదిర్చితి నని చెప్పితిని. అందువల్లనో ఏకారణమువల్లనో కాని నన్ను తన బంగళాలో బసచేయు మని కోరసందున సమీపమున నున్న శ్రీఅల్లాడి కృష్ణస్వామిగారి బంగాళాకు వి. ఎల్. శాస్త్రిగారున్ను, నేనును వెళ్లి అచ్చట స్నానపానాదులు ముగించుకొని భోజనము చేసితిమి. భోజనము కాగానే శ్రీ వి. ఎల్. శాస్త్రిని శ్రీ దాసు గారివద్దకుంబంపి, శ్రీ రామదాసుగారు నేను దివాను

బహాదూరు టి. రంగచారిగారిని సందర్శించి వారితో మాట్లాడి ఆమీద శ్రీమార్ గారి ఇల్లు చేరుకొంటిమి. శ్రీ టి. రంగాచారిగారు ఐదువందలు విరాళముగ శ్రీదాసుగారి కిచ్చిరి. 3 గం॥ మొదలు రాత్రి 8 గం॥ వరకు నేను శ్రీ దాసుగారికి ఒక గొప్ప మొత్తమును యివ్వమని ఎంతచెప్పినను వినక రాత్రి 9 గం॥ పిదప శ్రీదాసుగారిని తన బంగళాకు పిలుచుకొని రమ్మని చెప్పిరి. విరాళముసంగతి వారితో చెప్పెదనన్న మీదట శ్రీరామదాసుగారు, నేను శ్రీదాసుగారి బసకువెల్లి బెంగుళూరున ఇద్దరు ప్రముఖుల సందర్శింపగా వారు చెరి వందరూపాయలు నిచ్చిరి. ఆమీద శ్రీరామదాసుగారిని మైసూరుహోటలున దిగబెట్టి శ్రీ సి. ఆర్. దాసుగారివద్దకువెల్లి వారిని, వి. ఎల్. శాస్త్రిని వెంటఁబెట్టుకొని శ్రీమార్ గారి బంగళాకు వచ్చితిమి. శ్రీదాసుగారు యెట్టిఆహారము భుజింతురో ఆసంగతి శేస్తూరితో చెప్పగానే పూరీ, పాయసము, బాదంహాల్వా మున్నగుపదార్థముల సిద్ధముగావించెను. అన్నము, సాంబారుకలిపిన అన్నమును ఒక గిన్నెలో నుంచెను. అప్పడములు, పెరుగు, పొడి అన్నము, ఊరగాయలు మున్నగువానిని గూడ బల్లమీద నుంచెను. ప్రక్కన కుర్చీన శ్రీమార్ గారు కూర్చొని శ్రీదాసుగారు ఆహారము

పుచ్చుకొనుచుండగా మాట్లాడుటకు ప్రారం భించిరి. అప్పటికి దాదాపు 10 గం॥ ఆయెను కావున, నేను వి: ఎల్. శాస్త్రి, శ్రీ అల్లాడి కృష్ణ స్వామిగారి బంగళాకు తిండికై వెళ్లగా 8 గం॥లోగా అందరు తిండి తిని పండుకొని రనియు, వంటమనిషి కూడ వెళ్లె ననియు వాకిట నున్న జవాను చెప్పెను. ఆకలితో బాధపడుచున్న ఉభయులము మేము మరల సి. ఆర్. గారి బంగళాకు రాగా శ్రీదాసు గారు బసకు బయలుదేరిరి. శ్రీమాణ్ గారు వారితో ఏమిచెప్పిరో శ్రీదాసుగారు మాతోఁజెప్పరైరి. కాని కొంతకాలమునకుగాని తాను స్వరాజ్యకక్షలో చేరుటకు వీలు కాదని చెప్పినట్లు పిమ్మట మాకు తెలిసెను. శ్రీదాసుగా రున్నచోట నిద్రించుటకు వీలుండెను కాని ఉదయమునుండియు ఇటూ అటూ తిరుగుటచే ఆకలి బాధించుచున్నందున శ్రీ వి. ఎల్. శాస్త్రి, నేను శ్రీ అల్లాడిబంగళాకు వచ్చి కేకలు వేసి వాకిలితలుపులు తట్టగా కొంతసేపటికి శ్రీకృష్ణ స్వామిగారి భార్య వాకిలితలుపు తీసి మమ్ముల భోజనమైనదా అని ప్రశ్నించిరి. తిండితినలేదని యామెగారితో విధిలేక చెప్పవలసివచ్చెను. మేము పడకలపరచుచుండగా నామె వచ్చి తాను కొంత చారుఅన్నమును సిద్ధము గావింతు నని చెప్పి రాత్రి

12 గం॥ మాఇద్దరికి అన్నము పెట్టినందున ఆ మీాద నిదురపట్టెను. ఈదురవస్థకంతటికిని శ్రీమార్గ కారకులని శ్రీవి. ఎల్. శాస్త్రి ఆల్లరి ప్రారంభించెను. వేకువను నాలుగుగంటలకు మే మిద్దరము లేచి నిత్య కృత్యముల తీర్చుకొనుచుండగా శ్రీకృష్ణస్వామిగారి వంటమనిషి కాఫీ తెచ్చియిచ్చెను. నేను త్రాగి శ్రీ సి. ఆర్. దాసుగారి బసకువెళ్లి వారిని వెంటబెట్టుకొని బెంగుళూరుసిటీ రైలుస్టేషనునకు కారు వదలు మని చెప్పుచు మార్గమున శ్రీ రామదాసుగారి హోటలు వద్ద ఆగి రైలుస్టేషను చేరినంతనే కారును వారికై పంపెద మని చెప్పితిమి. అందరము బెంగు ళూరునుండి చెన్నపట్టణము చేరుకోగానే మరునాడు శ్రీ రామదాసుగారు తనబంగాళాలో శ్రీదాసుగారి గౌరవార్థము గొప్పవిందు గావించి ప్రముఖు లనేకుల నాహ్వానించిరి. విందుకాగానే అందరము శ్రీమార్గ. ఏ. రంగస్వామి అయ్యంగారు బంగాళాకు 4 గం॥కు వెళ్లితిమి. శ్రీ రంగస్వామిఅయ్యంగారు శ్రీదాసుగారి గౌరవార్థము ప్రముఖులైన కొందరు ఆప్తులను మాత్ర మాహ్వానించిరి. పార్టి ముగియగానే వసూళ్ల లెక్కల సరిచూచుకొగా 30 వేలు శ్రీ దాసుగారికి ముట్టె నని ఏర్పడెను. నాటిరాత్రి యీాసొమ్ముతో శ్రీ సి. ఆర్. దాసుగారు మదరాసునుండి కలకత్తాకు

ప్రయాణమైరి. శ్రీదాసుగారు ముందువెనుక లాలోచింపక తలవనితలంపుగా బెంగళూరునుండి ప్రయాణమైనందుకు తనకాశ్చర్యము కల్గెనని శ్రీమాన్ చెప్పిరి. శ్రీ సి. ఆర్. దాసుగారిపై శ్రీమాన్‌గారికెంత యభిమానముండెనో అంతయభిమానము శ్రీ సుభాషుచంద్రబోసుగారిపై నుండెడిది. వీరుభయుల గుణాతిశయములును స్వార్థత్యాగములఁ గూర్చి పలుమారారోజులలో శ్రీమాన్ ముచ్చటించెడివారు. స్వరాజ్యకక్షి నిర్మాణముకాగానే శ్రీమాన్ గారికిని శ్రీ గాంధీగారికిని మధ్య అభిప్రాయభేదములు ఏర్పడినందుకు కారణము లనేకములుగాని హిందూముస్లిములమధ్య సంధికుదుర్చుటకు శ్రీ దాసుగారికి తనకు తప్ప ఇతరులకు సాధ్యముగాదని శ్రీమాన్‌గారు శ్రీగాంధీతో నిష్కర్షగా చెప్పిరి. ఒకప్పుడు ఆలీసోదరులు బ్రతికి యుండగా హిందూమహమ్మదీయులమధ్య సంప్రతింపులు సాగింప వీరు ప్రయత్నించిరి. వీ రప్పుడు శబర్మతీఆశ్రమమునకు వచ్చియుండిరి. రెండుమూడురోజులు సంప్రతింపులు సాగినమీదట సమావేశము ఏ తీర్మానమునకురాక సమాప్తమాయెను. రాజకీయవ్యవహారములలో భిన్నాభిప్రాయములు జనింపలేదు గాని, మసీదుల ముందు హిందువులు మేళము వాయింపరా దనియు

బక్రీదునాడు పశువులనుచంపుటకు హిందువులు ఆటంకపరచరాదనియు ఆలీసోదరులు పట్టుపట్టిరి. శ్రీగాంధీగారు ముస్లిములకోరికను సఫలముగావింప సిద్ధపడిరేకాని హిందువుల మనోభీష్టములను జార విడచిరి. కావుననే హిందూముస్లిములమధ్య సబర్మతీ ఆశ్రమములో సమైక్యత కష్టసాధ్యమాయె నని శ్రీమాక్‌గారు వెల్లడించిరి. నాడు ఏర్పడిన విభేదములవలన క్రమేణా కలతలు హెచ్చెను. కాని తానేవిధముగనైన రాజీ కుదుర్చగలనని చెప్పినను శ్రీ గాంధీగారు ఇందుకు అవకాశ మివ్వ రైరి. చట్టప్రకారము ఢిల్లీ అసెంబ్లీలో మహమ్మ దీయులకు ఇవ్వబడిన స్థానములకన్న 5 స్థానములు హెచ్చుగ ఇప్పింపబడవలెనని ముస్లిములు చెప్ప సాగిరి. శ్రీమాక్‌గారు ముస్లిముల కోరికను సఫలముగావింప ఇష్టపడిరికాని శ్రీగాంధీగారు మరల అడ్డు తగిలిరి.

సంపూర్ణస్వరాజ్యము భారతీయుల ఆశయము కావున కాంగ్రెసు ఈకోరికకు అనుగుణముగ ఒక తీర్మానముగావించి ఇందుకై దేశమంతట ప్రచారము సాగింపవలెనని శ్రీమాక్‌గారు సూచించిన సూచనను శ్రీగాంధీగారు సమ్మతింపరైరి.

సర్కారు ఉద్యోగులను తమపనులు వదలుకొను డనియు, విద్యార్థులు కాలేజీ పాఠశాలలు బహిష్క రింపవలెననియు, న్యాయవాదులు కోర్టులకు వెళ్ల రాదనియు కాంగ్రెసు పలుమారులు తీర్మానించు టయు, ఆమీాద దేశమంతట ప్రచారము సాగించు టయు పొరబాటని శ్రీమాళ్గారు శ్రీగాంధీగారితో చెప్పిన దానిని వీడి వారు ఈమాటలను పెడచెవిన బెట్టిరి.

రాజకీయవ్యవహారములను మతసాంఘిక వ్యవహా రములతో ముడిబెట్టినచో రెండు వ్యవహారములును పాడగునని శ్రీ శ్రీనివాసఅయ్యంగారు శ్రీగాంధీగారికి విస్పష్టపరచిరి. కాని శ్రీగాంధీ అహింసాప్రచారమును ఎన్నడు మాననసనియు, తన అంతరాత్మ చెప్పినట్లు కాంగ్రెసు వ్యవహారములను తానే సాగింతుననియు శ్రీఅయ్యంగారితో చెప్పినందున ఉభయులకు ఎందున గాని సమ్మతి, అనుకూలమువ్పడుట కష్టసాధ్యమా యెను. 1926 సం॥న గౌహాతీ కాంగ్రెసునకు శ్రీమాళ్ గారు అధ్యక్షులుగ ఎన్నుకోబడిరి. ఈకాంగ్రెసు తీర్మానములను శ్రీమాళ్ సిద్ధము గావించుచుండగా, శ్రీగాంధీగారివద్దనుండి వీరి కొకయుత్తరము వచ్చెను. ఇందు లోతుతెలియక ఏల నీళ్లలో శ్రీమాళ్ దిగు చున్నారని గాంధీ హెచ్చరించెను. శ్రీమాళ్గారు

తన భార్యను పిలిచి శ్రీగాంధీగారి జాబును చదివి, మీదయ యున్నచో నేను నీళ్లలో మునగననియు, గట్టునకు తలచినపుడు రాగలననియు బదులు వ్రాసిన జాబును చదివిరి. గౌహాతీ కాంగ్రెసుకు శ్రీమూర్ గారి కుమార్తె శ్రీమతి అంబుజమ్మాళ్ వత్తునని ప్రాధేయపడెను. కాని శ్రీమూర్ ఇందుకు సమ్మతింపరైరి. 41 ఏనుగుల ఊరేగింపున శ్రీమూర్ గారిని రైలుస్టేషనునుండి కాంగ్రెసు ఆవరణమునకు తీసికొని వెళ్లు ఏర్పాట్లు గావింపబడెను. కావున ఇన్ని ఏనుగులముందు శ్రీమూర్ ఒక ఏనుగుపై ఊరేగించు వైభవమును తాను తప్పక చూచితీరవలయునని ఆమె ఎంత ప్రాధేయపడినను శ్రీమూర్ వినరైరి. ఈలోగా స్వామి శ్రీ శ్రద్ధానందగారిని ఢిల్లీ నగరవీధిన ఒక తురకహంతకుడు కత్తితో పొడిచి చంపెనను వార్త శ్రీమూర్ గారికి తెలియగానే గౌహాతిలో ఏర్పాటైన ఏనుగుల ఊరేగింపును ఆపివేయుమని గౌహాతీ కాంగ్రెసు కార్యదర్శులకు వీరు ఒక తంతెనంపిరి. శ్రీమూర్ గారు తమకు లభించు కీర్తిని, గౌరవమును తమ కుటుంబమువారు తనివితీర అనుభవింపవలెనని భావించెడువారు కారు. చెన్నపట్టణములో సాగు సభలకు కూడ వీరు తమ ఇంటివారిని వెంటబెట్టుకొని

వెళ్లెడువారు కారు. ఇంటివారు పైకి వెళ్లినచో ఇంటిపనులను క్రమేణ మానుదురనియు, ఇంటిలో దక్షతయుండదనియు చెప్పెడువారు. అట్లు చెప్పినను ఇంటివారిపై వీరికి అపారప్రేమ గలదని ఇంటివారు, పైవారుగూడ గుర్తించిరి. ఇంటిలో నెవనికి జబ్బుచేసినను వెంటనే డాక్టరును పిలిపించి మందిప్పించి గంటకు 4, 5 సార్లు జబ్బెట్లున్నదని జబ్బుపడ్డవారిని ప్రశ్నించుచుందురు. శ్రీ మాన్ సేలం విజయరాఘవాచారిగారు నాగపూరు కాంగ్రెసుకు అధ్యక్షులైనపుడు శ్రీమాన్‌గారిని తప్పక నాగపూరు రమ్మని కోరగా ప్రయాణమునకు సిద్ధపడిరి. కారు మీద వంటమనిషి, గుమాస్తా శ్రీ రామచంద్రఅయ్యరు సెంట్రలుకువెళ్లి సామానులుదింపి శ్రీమాన్‌గారికి సీటు రిజర్వుచేయుటకు యత్నించుచుండగా వీరి మనుమడు కృష్ణస్వామికి (శ్రీఅంబుజమ్మాళ్ కుమారుడు) నాటి ఉదయము జ్వరముతగిలి హెచ్చెను. సాయంత్రము డాక్టరు పరీక్షింపగా 105° జ్వరమున్నట్లు వెల్లడియాయెను. వెంటనే టెలిఫోనున రామచంద్రయ్యరును సామానులతో వెనుకకు రమ్మనిచెప్పి కారెక్కి యకాయకిన డాక్టరును పిలుచుకొని వచ్చిరి. ఇంటివా రెంత చెప్పినను ఏదియు వినక, కొంపమునిగెనని అరచు

చుండిరి. డాక్టరు ఇచ్చుమందు ఎప్పటివలె పరిశీలించి ఆమీాద మనుమనికి ఇచ్చెడివారు. తెలిసీ తెలియని వైద్యులు రోగికి అపాయము కలిగింతురని వీరి అభిప్రాయము కావున ఏడాక్టరు ఇంటికివచ్చినను వారిని ఎన్నియో ప్రశ్న లడిగెడువారు. ఎంత ప్రవీణుడైన డాక్టరైనను వీరు అడుగుప్రశ్నలకు తగు సమాధానము ఇవ్వనిచో వాడతో గంటసేపు మాట్లాడిగాని డాక్టరును వదలెడివారు కారు. 1930-32 సం॥లో శ్రీమాణ కుమార్తె శ్రీ అంబుజమ్మాళ్ శ్రీగాంధీ కార్యక్రమమున పూర్తిగ పాల్గొనుచు, దూదేకుల మతస్థులతోకలిసి ప్రచారము సాగించుచుండిరి కావున కుమార్తెతో ప్రీతితో మాట్లాడరైరి. కాని, కుమార్తె ఏఏ చోట్లకు వెళ్లు చున్నదో, ఏ ఏపనుల సాగించుచున్నదో మున్నగు వివరము లన్నిటిని భార్యనడిగి తెలుసుకొనుచుండిరి. కాని ఎన్నడైన కుమార్తె సమీాపించినచో కండ్లు ఎఱ్ఱజేసికొని ముఖమును చిట్లించుకొనెడివారు. అప్పట్లో శ్రీ అంబుజమ్మాళ్ తండ్రిగా రున్నచోటికి వెళ్లుటకుగూడ భయపడుచుండెను. కుమార్తె జైలునకువెళ్లు రోజునగూడ తన ఉద్దేశమును శ్రీమాణ గారికిచెప్పలేదు. కాని కుమార్తెను పోలీసులు లాకపునకు తీసికొనివెళ్లగానే శ్రీమాణగారి మనస్సుకరగి

వెంటనే పోలీసుకమీషనరు ఆఫీసుకువెళ్లి కుమా
ర్తెను చూచివచ్చిరి. ఆమీద శ్రీ అంబుజమ్మాళ్ కు
శిక్ష విధించి యామెను వేలూరుజైలుకు పంపు
చుండగా మరల శ్రీమాౙగారు, వీరి భార్య మరల
వెళ్లి కుమార్తెను జూచి వచ్చిరి. ప్రతివారము
జైలు ఇంటర్వ్యూకు భార్యతో వేలూరునకు పండ్ల
బుట్టలతో వెళ్లెడివారు. మొదటి ఇంటర్వ్యూన
కమ్ములదాటి లోపలికి వెళ్లరాదని పోలీసులు అడ్డ
గించినందున ఇట్టి ఆటంకముల కల్పించినచో తాను
కుమార్తెతో మాట్లాడకనే వెళ్లెదనని ప్రయాణమై
చెన్నపట్టణము వచ్చిరి. రెండవ ఇంటర్వ్యూకు
శ్రీమాౙ వేలూరుజైలుకు వెళ్లగా ఇనపకమ్ములు
తీసివేసి నిరాఘాటముగ కుమార్తెదగ్గఱకువెళ్లి
మాట్లాడుటకు జైలు అధికారులు అవకాశములు
కల్పించిరి. 1927 సం॥ మదరాసున కాంగ్రెసు సమా
వేశమును శ్రీమాౙగారు తమ యాజమాన్యమున
మిక్కిలి వైభవముతో జరిపి చాల చోట్లకు వెళ్లి
గొప్ప మొత్తమును పోగుచేయుటయేగాక సొమ్ము
వృథాగా ఖర్చుగాని ఏర్పాట్లన్నిటిని చేయించిరి.
వీరు మధుర, రామనాథపురము, కారైకుడి మున్నగు
చోట్లలోఉన్న తమ కక్షిదారుల యిండ్లకు వెళ్లి

కాంగ్రెసు ఖర్చులకు విరాళముల నిమ్మని కోరగా వారందరును కలసి 60 వేలు, వసూలుచేసి శ్రీమార్ గారి చేతి కందిచ్చిరి. భారతదేశమునకు సంపూర్ణ స్వరాజ్యమే అవసరమను తీర్మానము ఈ మదరాసు కాంగ్రెసున నెగ్గుటకు శ్రీమార్ గారే కారకులు. విరాళములవల్లను టిక్కెట్లు విక్రయించుటవల్లను దాదాపు 3 లక్షలకు పైగా సొమ్ము లభించెను కాని రెండులక్షలుమాత్రమే ఖర్చుబెట్టి తక్కిన సొమ్ముతో రాయపేటలో 10 నివేశనముల స్థలమును కొనిరి. ఆమీద సుప్రసిద్ధ ఇంజనీరును, మదరాసురాష్ట్ర మాజీ మంత్రియు నగు డివాన్‌బహదర్ ఆర్. ఎన్. ఆరోగ్యస్వామి మొదలారిగారిచే చక్కని ప్లాను తయారుచేయించి కాంగ్రెసు భవనమును చెన్న పట్టణమున నిర్మించి కాంగ్రెసునకు భవనములేదను కొరతను తీర్చిరి. దురదృష్టవశాత్తు 1939 సం॥న ఈ భవనమున కాంగ్రెసు వస్తుప్రదర్శనశాల సాగు చుండగా ఎలెక్ట్రిక్ తీగలవల్ల మంటలు ప్రారంభమై యీ భవనము బూడిద పాలాయెను. ఈ మదరాసు కాంగ్రెసు సమావేశమగుటకు కొన్ని నెలలకు ముందే భారత స్వరాజ్యప్రభుత్వపు ఏర్పాట్లు ఏ తీరుగ నిర్మాణము కావలెనో సూచించుచు ఆ సూచనల నొక పుస్తకరూపకముగ ప్రకటించిరి. కాంగ్రెసు

సాగిన పిదప 1923 సం॥ ఏప్రెలు నెలలో శ్రీమాన్గారు ఐరోపాకు ప్రయాణమైరి. ఆస్ట్రియా, స్విట్జర్లండు, జర్మనీ, ఫ్రాంసు మున్నగు దేశములలో కొంతకాలము పర్యటించి ఆ మీద ఇంగ్లాండు చేరిరి. రష్యాలో వీరు మార్షల్ స్టాలిన్ అతిథిగ నుండిరి. మాస్కోనగరమున కొన్నిరోజులుండి ఆ నగరమందలి చూడదగిన ప్రదేశము లన్నింటిని చూచిరి. క్రెమ్లిను భవనముననే స్టాలిన్‌ను సందర్శించి రెండుగంటలు వారితో సంభాషించిరి. రూస్వెల్టు, చర్చిలు, స్టాలిన్ ముగ్గురును ఆరోజులలో అందరి దృష్టిని ఆకర్షించుచుండిరి. లండనున పార్లమెంటు సభ్యు లనేకులను కలసికొని అనేక రాజకీయవిషయములగూర్చి వారితోసంభాషించిరి. లండనునుండివెళ్లి వారి దేశస్వాతంత్ర్యమును సంపాదించిన డీవెలరాంగారిని డబ్లినున సందర్శించి ఐర్లండున చూడదగిన చోట్లు చూచి ప్రజాసామాన్యము ఏస్థితిలో కాలము గడపుచున్నారో ఆ సందర్భములను గుర్తించిరి. శ్రీమాన్‌గారు ఐరోపా సంచారము ముగించుకొని స్వస్థలమునకు రాగానే సర్వపక్ష మహాసభ తీర్మాన ప్రకారము శ్రీమోతీలాలు శ్రీనెహరూంని సిద్ధము గావించిన ప్రణాళిక వెల్లడియాయెను. ఈ ప్రణాళి

కలో తా నెంతో కాలముగ చెప్పుచుండిన అభిప్రాయ ములు కనబడకపోయినందున ఇకను హిందూ ముస్లి ముల మధ్య సంధికుదురదని తలచి వీరు నిస్పృహు లైరి. మదరాసు కాంగ్రెసున హిందూ ముస్లిముల మధ్య రాజీ కుదిర్చి ఉభయులకు సంతృప్తియగు కొన్ని తీర్మానములను శ్రీమాన్ గారు నెగ్గించిరి. కల కత్తా ముస్లింలీగుకూడ మదరాసు కాంగ్రెసు కావిం చిన తీర్మానములకు సంతృప్తిగాంచెను. శ్రీనెహ్రూ ప్రణాళిక మదరాసు కాంగ్రెసుతీర్మానమునకు భిన్న ముగ నుండుటయే గాక, శ్రీ జిన్నా ఆలీసోదరులు మున్నగు ముస్లిం నాయకు లందఱికిని అసంతృప్తిని గలిగించెను. కావున విభేదములు హెచ్చాయెను. ఈ కారణములచే కాంగ్రెసుపై శ్రీమాన్ గారికి అసం తృప్తి హెచ్చెను. శ్రీనెహ్రూ ప్రక్కన శ్రీగాంధీ కూర్చొని పక్షపాతబుద్ధితో పైతీర్మానములను నెగ్గించి రని శ్రీమాన్ గారి దృఢాభిప్రాయము. 1928 సం॥ కలకత్తాన సమావేశమైన కాంగ్రెసున పై విషయముల గూర్చి దీర్ఘోపన్యాసములగావించి మదరాసు తీర్మాన ములను శ్రీనెహ్రూ తన రిపోర్టున ఏతీరున దిగ ద్రొక్కిరో దానిని గూర్చి యుద్ఘాటించిరి. పరస్పర అభిప్రాయభేదములవల్ల కలకత్తా కాంగ్రెసున

శ్రీగాంధీగారికిని, శ్రీమాక్ గారికిని కలతలు హెచ్చా యెను. శ్రీగాంధీగారిని ధిక్కరించి శ్రీమాక్ చెన్న పట్టణము వచ్చిచేరిరి. చెన్నపట్టణమునకు రాగానే అనుచరులను ప్రోగుచేసి కాంగ్రెసునకు సంబంధపడిన వారు, శ్రీనెహ్రూ రిపోర్టుకు ప్రతికూలురుఅగు అనే కుల సమ్మతితో కాంగ్రెసున నొక నూతనకక్షను లేవ నెత్తిరి. ఈ కక్షకు శ్రీమాక్ అధ్యక్షులుగను, శ్రీ సుభాష్‌చంద్రబోసు కార్యదర్శులుగను యెన్నుకో బడిరి. నూతనకక్ష ఆదర్శమును, కార్యక్రమమును ఆలోచించి సిద్ధముగావించి వీరు ప్రకటించిరి. అన్ని పనులను మాని యీ నూతనకక్షకై రేయింబవళ్లు పాటుబడుటకు ప్రారంభించిరి. తనసేవ, స్వార్థ త్యాగముపడిన కష్టములన్నియు నేల పాలాయె ననియు, సంఘమునకుగాని, దేశమునకుగాని లాభము లేకపోయినదనియు, మిత్రులమని చెప్పు కొందరు నాయకులు కుట్రపన్ని వీరిపనులను చెడగొట్టిరనియు ఇకను కాంగ్రెసుననుండుట నిష్ప్రయోజనమనియు తలచి వీరు కాంగ్రెసుతో సంబంధము వదలుకొనిరి.

శ్రీమాక్ గారు కాంగ్రెసును వదలినమీదట శ్రీగాంధీగారు వీరియుపన్యాసములను, అభిప్రాయము లను నిరసించుచు వీరి కొక జాబు వ్రాయగా శ్రీమాక్

గారికి కోప మధికమాయెను. కొందరు శ్రీగాంధీగారిని 'మహాత్మా' అని తలచువారు. కాని, డాక్టరు ఆనిబి సెంటు వారికి ప్రసాదించిన యీ బిరుదునకు వారు తగరని శ్రీమూర్ గారు చెప్పుచు శ్రీగాంధీగారి వర్త నను గూర్చి బహిరంగసభలలో చర్చించుటకు ప్రారంభించిరి. శ్రీ గాంధీ శాంతస్వభావు లని అనేకులు భావించినది పొరబాటని పై సందర్భమున రూఢి యాయెను. పనికిమాలిన పైజాబును శ్రీ గాంధీగారు వ్రాయనిచో శ్రీమూర్ గారెన్నడును కాంగ్రెసును వదలరని నేనేగాక యింకెందరో అభిప్రాయపడితిమి. తా మేకారణములవల్ల కాంగ్రెసును వదలిరో ఏకరుబెట్టుచు 1930 సం॥ స శ్రీమూర్ గారు ఒక ప్రకటన గావించిరి. శాసనోల్లంఘన తీర్మానమును ప్రతిపాదించుటకు కొన్నినెలలకు ముందే నేను కాంగ్రెసును వదలిపెట్టితిని కావున ఇందుకు కారణము క్రింద వివరించెదను:—

"నేను ప్రతిపాదించిన హిందూ ముస్లిము ఒడంబడి కను, నేను మదరాసు కాంగ్రెసున నెగ్గించిన సంపూర్ణ స్వరాజ్య తీర్మానమును కాంగ్రెసును, శ్రీగాంధీ, శ్రీనెహరూగారలు దిగద్రొక్కుటవల్ల వీ రుభయులు కాంగ్రెసు వర్కింగుకమిటీస సభ్యులుగా నుండుట

వల్లను వీరితో గలిసిపనిచేయుటకు నే నెన్నడును ఇష్టపడను. తిరునల్వేలిజిల్లా తిరుక్కురుంగుడిలోను, లాహోరు కాంగ్రెసునను పై సందర్భములను నేను నిరాఘాటముగ వెల్లడించుటయేగాక మరికొన్ని చోట్లలోను, స్వదేశమిత్రన్ కార్మికుల సంఘసమావేశమునను నేను నా అభిప్రాయములను వెల్లడించితిని. శ్రీ గాంధీగారి కక్షవారికిని, నాకును సంబంధము లాహోరు కాంగ్రెసులోనే వదలి మేము దూరమైతిమి." శ్రీమూర్‌గారికి శ్రీగాంధీగారి రాజకీయ కార్యక్రమముపై నమ్మకము లేకున్నను, శ్రీ గాంధీగారి అహింసా సిద్ధాంతమును తన జీవితమున ఆచరణలో పెట్టుటకు అంతరాత్మ సూచించినట్లు ఆసరకు శ్రీమూర్ తలచిరి కాని తాను పొరబాటు పడితినని వెల్లడించిరి. శ్రీ గాంధీగారి నిజస్వరూపమును తెలుసుకొనలేక చెన్నపట్టణమున స్వదేశీ లీగును సర్శించి కొంత సొమ్మును వెచ్చించుటయేగాక శ్రీమూర్‌గారి కుమార్తె అంబుజమ్మాళ్, మరి కొందరు స్త్రీలు పాటుబడుచుండిరి. కాని యెన్నడును తన కుమార్తె అంబుజమ్మాళ్ సాగించు శ్రీగాంధీగారి కార్యక్రమమునకుగాని కృషికిగాని శ్రీమూర్ అడ్డము తగిలినవారు కారు. పనికిమాలిన ఉపన్యాసములను సభలలో సాగించి కారాగారము ప్రవేశింప

వద్దని అప్పుడప్పుడు కుమార్తెను హెచ్చరించుచుండిరి. శ్రీ అంబుజమ్మాళ్ వేలూరు జైలునుండి విడుదల అయినదిమొదలు శ్రీ గాంధీగారితో ఉత్తర ప్రత్యుత్తరములు సాగించుచుండిరి. వార్ధా ఆశ్రమమునకువెళ్లి శ్రీగాంధీని సందర్శించి వారితో కొంత కాలము ఆశ్రమమున నుండుటకు అనుమతి సంపాదించిరి. శ్రీగాంధీగారు హరిజనప్రచారమునకై చెన్నపట్టణము వచ్చినప్పుడు అంబుజమ్మాళ్ వారిని సందర్శించి వారిని తనయింటికి వెంటబెట్టుకొని వచ్చిరి. వీ రుభయులు సంభాషించినపుడు ఇదివరలో వీరి మధ్య జనించిన అభిప్రాయములను మాత్రము శ్రీగాంధీగాని, శ్రీ మాణ గాని మార్చుకొనరని నిష్కృష్టగ వెల్లడియాయెను. పరస్పర క్షేమలాభముల గూర్చియు, పనికిరావలిన ఇతర సందర్భముల గూర్చియు మాట్లాడిరి కాని ఉభయులమధ్య చీలిక ఏర్పడినందుకు విచారపడిరి.

శ్రీమాణ కుమార్తె కొంతకాలము శ్రీగాంధీగారివద్ద ఆశ్రమమున వాసముండవలెనని నిశ్చయించుకొనిరి. ఈమె బొంబాయి కాంగ్రెసుకు వెళ్లినపుడు శ్రీగాంధీగారిని సందర్శించి వారి ఆశ్రమవాసిగా కొంతకాల ముండుటకు అనుమతిని సంపాదించిరి. శ్రీ అంబుజమ్మాళ్ తన నగలన్నిటిని శ్రీగాంధీగారికి

అందించి వీని విక్రయమువల్ల లభించు సొమ్మును ఆశ్రమ ఖర్చులకు వినియోగించుకొమ్మని చెప్పిరి. ఈనగల ఖరీదు ముప్పదివేలుండునని నేను వింటిని.

ఇంటికి రాగానే తండ్రిగారగు శ్రీమాన్‌తో పై సందర్భమును చెప్పినప్పుడు వీరు చాల కోపపడి శ్రీ అంబుజమ్మాళును వార్ధాకు వెళ్లరాదనిరి. కొన్ని రోజులు తిండి తినక మొండిపట్టు పట్టినమీదట కుమార్తెను శ్రీమాన్ గారే వెంటబెట్టుకొని వార్ధా వెళ్లి శ్రీ గాంధీగారికి ఆమెను అప్పగించిరి. శ్రీగాంధీగారికిని, శ్రీమాన్ గారికిని కొంతకాలము వైషమ్యములు ఏర్పడియున్నను, శ్రీగాంధీగారు శ్రీమాన్ గారిని ప్రీతితో దగ్గరకు పిలచి, కూర్చొమ్మని చెప్పి మిక్కిలి మర్యాదతో వీరితో సంభాషించిరి. మరునాడు శ్రీమాన్ గారు చెన్నపట్టణమునకు ప్రయాణమగుచు కుమార్తెను చూచి కంట తడిబెట్టుకొనిరి. కుమార్తె తన ఆరోగ్యమును కాపాడుకొన శక్తిలేనిదనియు, శ్రీగాంధీగారే ఆమెకు అన్నివిధముల సహాయపడవలెననియు చెప్పి రైలు స్టేషనుకు ప్రయాణమైరి. 45 రోజులు శ్రీ అంబుజమ్మాళ్ వార్ధా ఆశ్రమమున నుండిరి. అప్పుడప్పుడు శ్రీమాన్ గారు శ్రీగాంధీకిని, కుమార్తెకును జాబులు వ్రాయుచుండిరి. వీరి జాబులకు బదులుగా శ్రీగాంధీ

గారు "మీ రెంతమాత్రము విచారపడ నక్కరలేదు. నేను శ్రీ అంబుజమ్మాళును జాగ్రత్తగా చూచుకొనుచున్నాను. త్వరలో ఆమెను తమ వద్దకు పంపెదను." అని జాబు వ్రాసిరి. కాని ఈలోగా తొందరపడి శ్రీ మాౘ్ గారు తన భార్యను వార్ధాకు బంపి కుమార్తెను పిలుచుకొని రమ్మని ఆదేశింపగానే శ్రీ గాంధీగారు అంబుజమ్మాళును బంపివేసిరి. ఆమె మరి కొన్నిరోజులు ఆశ్రమమున నుండతలచితినని శ్రీగాంధీగారితో చెప్పగా ఇందుకు వారు అవకాశ మివ్వరైరి. కుమార్తె శ్రీమాౘ్ గారివద్దకు వచ్చిన కొన్నిరోజులకు ఈ క్రిందిజాబును శ్రీగాంధీగారు వ్రాసిరి.

"తమ జాబందినది. మీ కుమార్తె నావద్ద కొన్ని రోజు లున్నందుకు తాము, తమభార్య సంతృప్తి చెందినందుకు కృతజ్ఞుడను. అంబుజమ్మాళ్ ఆశ్రమమున నున్నపుడు అన్నివిధముల ఆమె కాలము వ్యర్థము కాని మార్గమున గడపునట్లు చేసితిని. ఈమె ముందుకూడ కొంతకాలము శ్రద్ధతో ప్రజా సేవ సాగించునని ఆశించుచున్నాను."

శ్రీమాౘ్ ఎస్. శ్రీనివాసఅయ్యంగారు నిరంతర సేవవల్ల వేలకొలది భారతీయుల దృష్టిని ఆకర్షింప గల్గిరి. ప్రజాసేవలో స్వార్థమునకు చోటులేదని

గు తేరిగిన మహనీయుడీయన. వీరి దేశభక్తి, వీరి తెలివి తేటలు, వీరి తీక్ష్ణ విమర్శనాశక్తి, అకుంఠిత ధైర్య సాహసములు, నిరంతర కార్యదీక్ష ఇతరులయందు కనబడవు. వీరి కుటుంబమువారిపైనే గాక మిత్రులపై వీరికున్న ఆదరణ అపరిమితము, ప్రశంస నీయము. పరోపకారులును, ఉదారులును అగు ఈ గొప్ప వ్యక్తితో కొంతకాలము సహచరుడనుగా నున్నది నా మహాభాగ్యమని తలచుచున్నాను. 1929 సం॥ శ్రీమాన్ గారు కాంగ్రెసుతో సంబంధము వదలుకొన్నది మొదలు బంగళావదలి ఎచ్చటికి వెళ్లు వారు కారు. ఉదయము 6 గంటలకు నిద్రలేచి, అది మొదలు 9, 10 గంటలవరకు ఇంటికి వచ్చిన వారితో సంభాషించుటయు, ఆమీదట పైకి వెళ్లుటయు వీరి పూర్వపు అలవాటు. ఆరోజులలో రేయింబవళ్లు ప్రజాసేవయందే మగ్నులై యుండిరి. ఇట్టివారు రేయింబవళ్లు డ్రాయింగు రూమునందలి పడక కుర్చీన ఆసీనులై గ్రంథావలోకనమునందే కాలము గడపుట ఇంటివారికే గాక పైవారికి ఆశ్చర్యము గలిగించెను. వర్షము తగ్గినను దుమారము తగ్గలే దని కొందరు చెప్పినట్లు వీరు కాంగ్రెసుచు వదలినను ప్రతిరోజు ఎందరో కాంగ్రెసువాదులు వీరివద్దకు వచ్చుచుండిరి. వీరు కాంగ్రెసున స్వతంత్ర కక్షను లేవ

నెత్తినపుడు సందలకొలది జనము వీరివద్దకు వచ్చెడి వారు. కాని నగరమున ఒక అంధకారము ఆవరించె నని వీరి అనుచరులు చెప్పెడివారు. కాంగ్రెసు వ్యవహారములలో నాయకత్వము వహింపు మని ఎందరో ప్రార్థేయపడిరి కాని శ్రీగాంధీగారి కాంగ్రెసున తాను యెన్నడును జేరననియు, తాను సాగించిన పనులన్నిటిని వారు మట్టిపాలు గావించి రనియు బదులు చెప్పెడివారు. తాను మాత్రము కాంగ్రెసునకు విరుద్ధముగ నెన్నడును వర్తింపననియు, దేశమునకు స్వాతంత్ర్య మత్యావశ్యకము గావున దానిని సాధించుట తన ఆశయమనియు చెప్పెడివారు. ఉత్తర హిందూస్థానమువారు దక్షిణదేశపువారిని ఒక మోస్తరుగ క్రిందిచూపుతో జూచుచున్నారు గావున, దక్షిణ ఇండియాన యెన్నియో సమస్యలు పరిష్కారము కావలసి యున్నవనియు దక్షిణ వాసులు స్వతంత్రించి కృషిచేయుట యావశ్యక మనియు శ్రీమాన్‌గారు చెప్పెడివారు. శ్రీ సరోజినీ దేవి, శ్రీ జవాహర్లాల్ నెహ్రూ, శ్రీ రాజేంద్ర ప్రసాద్ గార్లు మదరాసుకు వచ్చినప్పుడు శ్రీమాన్ గారిని వీరి బంగళాలో సందర్శించి రెండు మూడు గంటలు వీరితో సంభాషించిరి. ఎటులైన వీరిని

కాంగ్రెసున మరల ప్రవేశపెట్టుటకు తీవ్ర ప్రయత్నము కావించిరి కాని ఆ ప్రయత్నము నిష్ఫల మాయెను. అందుచే వీరి అనుచరులగు శ్రీ కె. భాష్యముగారు శ్రీమాన్ గారితో సంప్రతింతు నని వారితో చెప్పిరి. కాని భాష్యముగారి మాటలను శ్రీమాన్ గారు పెడచెవిని బెట్టిరి.

శ్రీమాన్ మరల కాంగ్రెసున ప్రవేశించనందుకు ప్రబలమైన కారణము లనేకములు గలవు. జాతీయ వాదు లనేకులును హిందువులేగాక ముస్లిములు గూడ ఆశించినట్టి సంపూర్ణస్వరాజ్య తీర్మానమును కాంగ్రెసున వీరు నెగ్గించుటయేగాక అనేకసార్లు తిరిగి ప్రచారముగూడ సాగించిరి కావున వీరి సంవత్సరపు కృషి విఫలమగుట ఒక కారణము. నిజముగా తన్ను, తన ఆదర్శములను ఆదరించునట్లు పైకి కనబడుచు లోలోపల శ్రీ గాంధీగారిని బలపరచుచు కొందరుండుట రెండవ కారణము. కాంగ్రెసున క్రింద మీదబడి శ్రీగాంధీగారు తనమాట చెల్లునట్లు చేసికొనిరే కాని వారివలె వర్తించుటకు తనకు సాధ్యము కాకపోవుట మరొక కారణము. వయస్సు హెచ్చుటయు, అపార ఆయాసము తగ్గుటయుకూడ శ్రీమాన్ మరల కాంగ్రెసులో చేరకపోవుటకు

కారణములుగ నుండవచ్చును. చాలకాలము వీరితో సంబంధపడియుంటిని గావున వీరి పట్టుదల, మొండితనము మొదలగునవి స్వాభావికము లని నేను గుర్తింపగలిగితిని. వీరు తా ననుకొన్న పనిని ఏవిధముగనైన చక్కబెట్టినగాని, తానేగాక యితరులను కూడ నిద్రపోనివ్వనివారని చదువరులు గుర్తింపవలెను. కాంగ్రెసును వదలినను ఆఖరువరకు రాజకీయములలో అభిరుచిని వీరు వదలలేదు. రాత్రులలో మదరాసు ఆక్టింగు ప్రధానన్యాయమూర్తియగు శ్రీ వేపా రామేశం, న్యాయమూర్తి శ్రీ ఎమ్. పతంజలిశాస్త్రి మున్నగువారు కొందరు వచ్చి వీరు వెలిబుచ్చు అమూల్య రాజకీయాభిప్రాయములను తెలిసికొనుచుండెడివారు. శ్రీ పతంజలిశాస్త్రిగారు కొంత కాలమునకు ఢిల్లీ సుప్రీంకోర్టున ప్రధానన్యాయమూర్తిపదవిలోనుండగల్గిరి. కావున నిట్టివారు శ్రీమాన్‌గారి సునితాభిప్రాయములను గుర్తించుటకు యత్నించుటవల్ల శ్రీమాన్ అపార మేధావి అని ఏర్పడుచున్నది. ఒకొక్కప్పుడు వీరు ఇంటివారితోను, మిత్రులతోను అంతములేని సంవాదములను సాగించెడువారు కాన ఎప్పుడు వీరితో సంభాషింప ఎవరికిని వీలుగాకయుండెడిది. 1930 సం॥ ఆఖరున

మదరాసు విక్టోరియాపబ్లిక్ హాలులో శ్రీ సేలం విజయరాఘవాచారిగారి ఏబది సంవత్సరముల ప్రజాసేవను కీర్తించుటకై కొందరు ఒక మహాసభను ఏర్పాటుగావించి శ్రీమాన్‌గారిని ఆ మహాసభకు అధ్యక్షులుగ నుండమని కోరగా వీరందుకు అంగీకరించిరి. నాడు అధ్యక్షులకు సభాంతరమున వందనములు సమర్పించుచు మాజీ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ వి. వి. శ్రీనివాసఅయ్యంగారు, ఇకముందు మైలాపూరున శ్రీమాన్‌గారు ఒక సన్యాసివలె యెందున జోక్యము కలిగించుకొనక కలకాలము గడపరాదనియు, మరల ముందు నిలచి దేశసేవ పూర్తిగా కొనసాగింపవలయుననియు చెప్పిరి. సభ్యులందరు జయజయధ్వానముల సాగించుచు శ్రీమాన్ వి. వి. శ్రీనివాసఅయ్యంగారి కోరికను తప్పక సఫలము చేయవలెనని ఘోషించిరి. అప్పుడు గూడ శ్రీమాన్‌గారి మనస్సు మారలేదు గాని 1939 సం॥న మరల పౌరులు ఒక మహాసభను గావించి శ్రీమాన్‌గారిని నాయకత్వము వహింపు మని ప్రార్థించిరి. స్వదేశమిత్రన్ పత్రికాధిపతి శ్రీ సి. ఆర్. శ్రీనివాసన్‌గారు, ఈ రోజులలో వానప్రస్థాశ్రమమును ఆచరణలో

పెట్టువా రెవరు లేరనియు, శ్రీమార్క్ గారు తమ ఉన్నతస్థానమును వెంటనే ఆక్రమింపవలయుననియు సభలో వెల్లడించిరి. ఆమీద ఉపన్యాసము గావించిన శ్రీ కల్యాణసుందర మొదలియారేగాక మరికొందరు ప్రముఖులుగూడ పై అభిప్రాయములనే సూచించిరి. శ్రీమార్క్ గారు పరిస్థితులను పరిశీలించి ఎన్నడు తనకు ప్రజాసేవ సాగింపవలెనని తోచునో అప్పుడు తాను వచ్చెదనని ఒక ప్రకటన గావించిరి. ఈ ప్రకటనయేగాక పత్రికలలో రోజూ వీరు వ్రాసిన వ్యాసములు ప్రచురణ మగుచుండెను. ఈవ్యాసము లందలి నూతనాదర్శము లన్నియు ప్రజలదృష్టి నాకర్షించి వారిని ఉత్సాహపూరితులను గావించు చుండెను. కాంగ్రెసు మంత్రులను, వారి చర్యలను తీవ్రముగ ఖండించుచు ఉపన్యాసముల గావించు టయేకాక పత్రికలలో గూడ కాంగ్రెసు మంత్రులను తీవ్రముగ విమర్శించుచుండిరి. వేసవిలో వీరితో నేను కొడైకెనాలుకు వెళ్లియుంటిని. హైదరా బాదు నందలి సుప్రసిద్ధ బారిష్టరును, రాజకీయ వేత్తయు నగు అక్బరు ఆలీఖానుగారు శ్రీమార్క్ గారిని సందర్శించుటకై కొడైకెనాలు వచ్చిచేరిరి. శ్రీమార్క్ గారితో కొన్ని గంటలు సంభాషించిన

మీదట ఉభయుల మధ్య హిందూముస్లిము సమస్యనుగూర్చి ఒక ఒడంబడిక కుదిరెను. ఉరుభయుల సంతకములతో ఆ ఒడంబడికను వెంటనే పుస్తకరూపమున ప్రచురించిరి. ఇండియా ప్రభుత్వమునందును, రాష్ట్ర ప్రభుత్వములయందును మంత్రులసంఖ్య సరిసమానముగ నుండవలెనని అందు సూచింపబడెను. అనగా హిందువు లెందరో ముస్లిము లందరు మంత్రులుగా నుండుటకు శ్రీమాన్‌గారు సమ్మతించిరి. శాసనసభ్యులుగా ఎన్నుకోబడినవారే మంత్రులను ఎన్నుకోవలెనని శ్రీమాన్‌గారి నిశ్చితాభిప్రాయము. శాసనసభ్యులు సాధారణ ప్రజాప్రతినిధులు గావున వారిలో అధిక సంఖ్యాకులు మంత్రి పదవులలో సగము ముస్లిముల కిచ్చుటకు ఇష్టపడినచో దీనికి ఎవరును ఆటంకము చెప్పరాదని పై పుస్తకమున వ్రాయబడెను. హిందువులుగాని, ముస్లిములుగాని ప్రత్యేక రాజకీయసభల నిర్మింపరాదనియు, సైన్యమునగూడ పదవులు సగము మహమ్మదీయుల కిచ్చుటకు శాసనసభ్యులు ఇష్టపడినచో ఈ కోరికనుగూడ ఆచరణలో బెట్టవలెననియు మరొక సూచన కావింపబడెను. ఈ పై ఒడంబడికను ప్రజలందరు ఆదరించినచో మహమ్మదీయులు

పాకిస్థాన్ నిర్మాణ ప్రయత్నమును వదలుకొందు రని శ్రీమాన్‌గారు అప్పుడు భావించిరి. ఈ ఒడంబడికను ప్రచురించిరేగాని శ్రీమాన్‌గారు ఇంటినుండి కదల కుండిరి. ఎందరో వీరిని సందర్శించుటకు వచ్చినపుడు పై ఒడంబడికకై దేశమంతట ప్రచారము సాగింప మని ప్రోద్బలపరచిరి కాని వీరు కదలరైరి. వీరికి రాజ కీయములలో నున్న అభిరుచి న్యాయవాద వృత్తిలో లేనందున కోర్టుకు వెళ్లరైరి. భారత రాజకీయ పరిస్థితులనుగూర్చి తా నొక గ్రంథమును ప్రచురింపదలచి ఎక్స్‌ప్రెసు పత్రికలో తన ఊహాలు వెల్లడించుచు రోజూ ఒక వ్యాసము ప్రచురించు చుండిరి. గ్రంథావలోకనమువల్ల సోమరితనము హెచ్చుగు చున్నదని తలచి కాబోలు హెన్రీ మెయిన్ రచించిన 'హిందూలా' గ్రంథమును 'హిగిన్ బాదమ్' కంపెనీవారికి సవరించి యిచ్చుటకు సమ్మ తించి, ఆ పనిని సంవత్సర కాలములో పూర్తి గావించిరి. దీనివల్ల భారతదేశమందేగాక విదేశము లందు గూడ వీరి ప్రతిభ వెల్లడి యాయెను. అప్పట్లో 'ఫార్వర్డు బ్లాకు'ను నిర్మించుటకు శ్రీ సుభాష్‌చంద్రబోసుగారు చెన్నపట్టణమునకు వచ్చి శ్రీమాన్‌గారిని సందర్శించిరి. ఈ బ్లాకున

చేరి నాయకత్వము వహింపవలెనని భక్తి పురస్సరముగ శ్రీశ్రీనివాసఅయ్యంగారును శ్రీబోసు గారు ప్రార్థించిరి. రాజకీయములలో పూర్వము తన కున్న ఉత్సాహము ఇప్పుడు లేదనియు, ముందువలె శ్రమపడి ప్రచారము సాగించుటకు శక్తి, ఓపిక లేవని యు, ఇట్టి స్థితిలో తాను నాయకుడుగా ఏర్పడినచో నూతన కక్షకు యేమాత్రముబలము చేకూరదనియు వీరు శ్రీ సుభాష్‌గారితో చెప్పిరి. కాని శ్రీసుభాష్ కోరిక ప్రకారము తాను త్రిపురా కాంగ్రెసుకు తప్పకవచ్చి శ్రీబోసుగారి కన్నివిధముల సహాయము గావింతునని మాట యిచ్చిరి. కాంగ్రెసున ఆరోజు లలో శ్రీగాంధీగారే గాక శ్రీ రాజేంద్రప్రసాదు, శ్రీ వల్లభాయి పటేలు, శ్రీ రాజగోపాలాచారి మున్నగు వర్కింగు కమిటీ సభ్యులుకూడ శ్రీసుభాష్ గారికి ప్రతికూలురుగ నుండిరి. శ్రీ సుభాష్‌బోసు అధ్యక్షతను శ్రీగాంధీగారి అనుచరులలో ఒకరు 'తూటుపడిన పడవ' అని చెప్పసాగిరి. ప్రముఖులు ఈ వైఖరితో వ్యవహరించు స్థితిలో అనుచరుల అభిప్రాయములనుగూర్చి ఏదియు చెప్ప వీలుగాక యుండెను. శ్రీ సుభాష్ చంద్రబోసుగారి జబ్బు హెచ్చినందుచే వీరు దేశమంతటా సంచారము

గావించి తన కక్షను బలపరచుకొనుటకు అవకాశము లేకపోయెను. కాంగ్రెసువాదుల ప్రవర్తన అసహ్యము పుట్టించెను. కావున భారతదేశమునకు త్వరలో సంపూర్ణ స్వరాజ్యము లభింపదని తలచి శ్రీమాన్ గారు చెన్నపట్టణమునకు మరలిరి. 1939 సం॥న యుద్ధము ప్రారంభ మాయెను. ఈ యుద్ధమున ఇండియాకు గూడ ఎన్నడును లేని విపత్తు సంభవించునని శ్రీమాన్‌గారు భావించిరి. రోజూ కొంతసేపు రేడియోవద్ద కూర్చొని యుద్ధవార్తల నన్నింటిని గుర్తించి వానిపై తన అభిప్రాయములను ఇంటికి వచ్చినవారితో చెప్పుచు త్వరలో ఇండియా అధోగతిపాలగునని చెప్పుచుండెడివారు. కాంగ్రెసు జాతీయసైన్యమును నిర్మించుట ఆవశ్యక మని తానెంతోకాలముగ చెప్పుచుంటిననియు, జర్మను ధాకకు ఎదుర్కొనన భారతీయులకు వీలుకాదు కాన అందరును శరణాగతిజొచ్చుట తప్ప గత్యంతరము లేదనియు చెప్పుచుండిరి. కొందరు అనుచరులు ప్రోద్బలపరచగా గొప్ప సభలలో వీ రుపన్యసించుచు పై స్వీయాభిప్రాయములను వెల్లడించిరి. 1941 సం॥ ఏప్రెలు మాసప్రారంభమున వీరు కొడైకెనాలుకు

ప్రయాణమైరి. నన్నును అచ్చటికి రమ్మనికోరిరి. కాని నేను అంతకుముందే రెండవక్లాసు రైల్వే కౌపనులను కొనియుంటిని గావున వెంటనే నేను ఒక దూరప్రయాణము వెళ్లి రానిచో కౌపనులు నిరుపయోగ మగునని చెప్పి హుబ్లీమీదుగా బెంగుళూరు వెళ్లితిని. అచ్చటనుండి 'వైట్ ఫీల్డు'కు వెళ్లి, అచ్చట రెండుమూడురోజులుండి మదరాసు చేరుకొంటిని. శ్రీమాన్‌గారు కొడైకెనాలులో జ్వరము తగిలి బాధపడుచు ఇంటికి పిలచుకొనివచ్చిరని తెలిసి వారినిచూచుటకై మైలాపూరుకు వెళ్లితిని. శ్రీమాన్ గారు అదివరకు ఎన్నడును ఒంటరిగ కొడైకెనాలు వెళ్లినవారు కారు. ఎన్నిమందు లిచ్చినను జ్వరము తగ్గనందున డాక్టర్లు శ్రీమాన్‌గారిని మదరాసుకు పిలుచుకొని వెళ్లమని తంతె ఇవ్వగా వీరి కుమార్తె శ్రీఅంబుజమ్మాళ్ వెంటనే కొడైకెనాలువెళ్లి వీరిని చెన్నపట్టణమునకు తీసికొని వచ్చిరి. వంటమనిషి కస్తూరి కూడ వీరితో ప్రయాణమాయెను గావున 8 గంటలలోగా శ్రీమాన్‌గారు "అంజద్ బాగు" బంగళాన వచ్చిచేరిరి. వీరిని చూచుటకువెళ్ళిన నాలుగైదురోజులకు ముందే వీరు చెన్నపట్టణమునకు

వచ్చిరనియు, జ్వరబాధ తగ్గనందున పడకలో నుండి యే తాను తలచిన ఏర్పాట్లన్నియు గావించిరనియు. శ్రీసత్యమూర్తిగారి అల్లుడు నాతో చెప్పి నన్ను శ్రీమూర్తిగారివద్దకు తీసికొనివెళ్లెను. అనుకొన్న పనులన్నియు పూర్తిచేసితిననియు, దేహయాత్ర చాలించుటకు సంసిద్ధముగ నున్నాననియు చెప్పుటకు ప్రారంభింపగానే వీరి కుమార్తె, భార్య మున్నగువారు భయపడవలసిన అవసరములేదని యెంత చెప్పినను వినరైరి. అయిదారు రోజులుగా భగవద్గీతలోని 12-వ అధ్యాయమును చదువుమని యెవరితోనైన చెప్పి వారు చదువుచుండగా ఆశ్లోకములను వినుచుండెడివారు. తనకు ఇక ఏచికిత్స గావింపరాదని నిష్కర్షగా కుటుంబమువారితో చెప్పిరి. వారు గొప్ప డాక్టర్లను రప్పింపగా శ్రీమూర్తిగారు డాక్టర్లతో "నాకు ఇకను జీవింపవలెననెడి ఆశ లేదు. తాము వెళ్లవచ్చును" అని చెప్పి వారిని పంపివేసిరి. "సర్వధర్మాన్ పరిత్యజ్య మాం ఏకం శరణం వ్రజ" అను శ్లోకమును పలుమారు స్మరించువారు. రెండుమూడు సార్లు నేను "సెలవు పుచ్చుకొని మరల వచ్చెద" నని చెప్ప యత్నించితినిగాని అందుకు సమ్మతింపరైరి.

నే నున్నచో నిరంతరము మాట్లాడుచుందురని వీరి భార్య, కుమార్తె భావింతురని నాకు తెలిసియు లేచివెళ్లుటకు శ్రీమాన్‌గారు సమ్మతింపరైరి. నే నేదియుచెప్పక కూర్చుండినను వీరు ఏవృత్తాంతము గూర్చియో కేకలు పెట్టుచుండిరి. 5 నిముషములు వీరు కన్నులుమూసికొనిన మీదట నిద్రపోవు చున్నారని తలచి వీరి సెలవులేకనే వీరి గదివదలి ఇల్లు చేరుకొంటిని. మరునా డుదయము (1?-4-41) నేను స్నానముచేయుచుండగా, 8 గం॥కు కాబోలు, శ్రీ ఎన్. డి. వరదాచారిగారు టెలిఫోనుద్వారా శ్రీమాన్‌గారు ఉదయము 6 గం॥లకు మరణించి రనువార్తను తెలియజేయగానే దిక్కుతోచక కొంత సేపు ఇంటివద్దనెయుండి ఆమీద మైలా పూరుకువెళ్లి శ్రీమాన్‌గారి శవమును జూచి కంట తడిబెట్టుకొంటిని. ఇంటిలో మనుమడు, మనుమ రాండ్రు నుండుటచే వారి భోజనమునకు ఇబ్బంది కలుగునని తలచి కాబోలు శ్రీ అయ్యంగారి కుమా రుడు శ్రీ పార్థసారథి దహనక్రియలను వెంటనే ప్రారంభించెను. మెరీనాచివర పోలీసు ఆఫీసు ప్రక్కన మైలాపూరువాసులకు శ్మశానము. కావున

శ్రీమాన్‌గారి కళేబరము శ్మశానము చేరువరకు అచ్చట నుంటిని. ఆవరకు బ్రాహ్మణుల శవములకు దహనకర్మ జరుపుటకు ప్రత్యేక స్థలముండెడిదికాదు. కాని రెండురోజులు ముందరనే ఒకభాగము బ్రాహ్మణులకై ప్రత్యేకింపబడుటయు అందు శ్రీమాన్‌గారి శవము ప్రథమమున దహనమగుటయు చూచి, చచ్చినను వీరికి పూజ్యత తగ్గలేదని అందరును భావించిరి.

---

# అనుబంధము

1926-వ సంవత్సరమున గౌహాతీ కాంగ్రెసుకు అధ్యక్షతవహించినప్పుడు శ్రీమాన్ శ్రీనివాసఅయ్యంగారుగావించిన ప్రసంగములోని ముఖ్యాంశములను కొన్నిటిని ఈక్రింద వ్రాయుచున్నాను.

శాసనసభాకార్యక్రమము.

జాతీయవాదులు చిరకాలమునకు ముందే నిర్ణయించుకొన్న ఏర్పాట్ల ప్రకారము దేశాభివృద్ధికి అధికారులు ఏ ఆటంకముగాని కల్పించినచో వారిందుకు నెదుర్కొనవలెను. జాతీయాశయములు నెరవేరుటకు శాసనసభలలో అనుకూలముండినచో వానిద్వారా కృషి సాగింపవలెను. ఎందునను అధికారుల నిరంకుశవర్తనకు ప్రజాప్రతినిధులగు శాసనసభ్యులు లొంగక ధైర్యసాహసములతో దేశస్వాతంత్ర్యమునకు నిరంతరము ప్రచారముసాగింపవలెను.

కేంద్రఅసెంబ్లీలోను, రాష్ట్రశాసనసభలలోను కాంగ్రెసు జాతీయవాదుల సిద్ధాంతములకు విరుద్ధ

ముగ అధికారులు అడ్డముతగిలినచో వీరు యెదు ర్కొనుటయే గాక సామాన్యప్రజలుగూడ అధి కారుల నెదుర్కొనునట్లు చేయవలెను. శాసనసభ్యులు ఈ క్రింది అంశములను ముఖ్యముగ గమనింప వలెను:—1. కాంగ్రెసుకోరిన ఆశయములను సఫలము చేయక ప్రభుత్వము కాలహరణముచేసినచో మనలో ప్రముఖులెవరును పదవులను స్వీకరింపరాదు. 2. మనము కోరు స్వరాజ్యమును ఇచ్చుటకు సర్కారు సమ్మతించువరకు బడ్జెటు చర్చలలో శాసనసభ్యులు పాల్గొనక శాసనసభనుండి లేచివెళ్లవలెను. 3. తన ఆధిక్యతను చిరస్థాయి గావించుకొనుటకు ప్రభు త్వము ప్రేరేపించు బిల్లుల నన్నింటిని మూలపడవేసి ఆప్రేరేపణను నెగ్గకయుండునట్లు చేయవలెను. 4. వ్యవసాయ, పర్త్రక, ఆర్థిక, కార్మిక వ్యవహార ములలో దేశము ముందడుగువేయుటకు శాసనసభ లలో తీర్మానములను ప్రతిపాదించుటయేగాక అవి నెగ్గుటకు ప్రయత్నింపవలెను. 5. గ్రామరైతులు, వ్యవసాయదారులు మున్నగు వారి పరిస్థితులు చక్క బడుటకు నిరంతరము పాటుపడవలెను. 6. జమీాం దారుల ఎస్టేట్ల కాజేయక ఎస్టేటురైతులకు సౌక

ర్యము కలిగించుటయే శాసనసభ్యులు ఆవశ్యముగా నుంచుకొనవలెను. 7. భూస్వామి, రైతు, యజమాని, కార్మికుడు - వీరిమధ్య విభేదములు తొలగుటకును, వ్యవసాయము, వర్తకము వృద్ధియగుటకును అందరును పాటుపడవలెను.

## సైన్యానావిక శాఖలు

ఈశాఖలను భారతీయులు నిర్వహింపలేరని ఉదాసీనముగనున్నచో పైవారెవరైన మనదేశముమీదికి దాడివచ్చిన యెడల దేశము అధోగతిపాలగును. కావున కొందరైనను బ్రిటిషుసైనికులుగాను, నావికులుగాను శిక్షణపొంది అవసరమైనప్పుడు దేశసంరక్షణమునకు తోడ్పడవలెను. ప్రభుత్వము యువకులను యుద్ధభటులగావింప ఇష్టపడనియెడల వారిని ప్రోద్బలపరచు కృషి ప్రారంభింపవలెను. బ్రిటిషు ప్రభుత్వము అన్నివిధములగు సంరక్షణము గావించునని కొందరు నమ్ముట పొరపాటు. స్వాతంత్ర్యము లభించినచో వెంటనే దేశసంరక్షణకు శక్తిలేక కలవరముగూడ జనింప వీలున్నదిగావున భారతీయులందరును దేశసంరక్షణకై అధిక కృషిసాగించుట నేడవసరము. చారిత్రకపరిశీలనలవల్ల భారతీయ

ఓడలు, నౌకలు విదేశములకు నెమ్మదిగ వర్తకము సాగించుటయేగాక ఎచ్చటనైన పోరాటము సంభవించినప్పుడు అందు పాల్గొని భారతీయులలో ముఖ్యముగ మహారాష్ట్రులు విజయమొందినట్లు తెలియుచున్నది. భారతదేశచరిత్రను భారతీయులే సమగ్రముగ వ్రాసినగాని ప్రజలలో దేశభక్తి ఏర్పడదనియు, ముఖ్యముగ పాఠశాలలలోను కళాశాలలలోను భారతీయ ప్రాచీనఔన్నత్యమును సూచించు పుస్తకములను యువకులు చదువునట్లు జేయుట దేశీయనాయకుల విధియనియు తలచుచున్నాను. జపానువంటి చిన్నదేశము, చైనావంటి పెద్దదేశము తమ దేశసంరక్షణకై ఇటీవల అన్నిఏర్పాట్లను గావించుకొన్నపుడు మనము యేల ఊరకుండవలెనని నేను ప్రశ్నించుచున్నాను. ఎవరుకాని వారిదేశమును సంరక్షించుకొను సామర్థ్యములేనిచో అట్టి దేశమునకు స్వాతంత్ర్యము లభించినను నిష్ప్రయోజనమనునది నా దృఢనమ్మకము.

ప్రభుత్వోద్యోగములు:— భారతీయులలో ఆంగ్ల విద్యగడించినవారు అనేకులు బీదలుగా వున్న ప్రభుత్వాదాయమువల్ల పేదరికమును పోగొట్టు

కొనుటకు సర్కారు ఉద్యోగముల నపేక్షించు చున్నారు. నౌకరులు యెల్లప్పుడును దాస్యముననే కాని దేశస్థితిగతి చక్కబడుటకు తోడ్పడరు.

ఇకముందు కాంగ్రెసు మంత్రులకును, ఇతరకక్షుల వారి మంత్రులకును ఏలాటి భేదముండదు కావున వీరిలో నెవరుకాని జాతీయాదర్శములకు విరుద్ధముగ వర్తింప నవకాశముండదని అందరును గుర్తింపవలెను. ఈమంత్రులు ఏవియో కొద్దిశాసనములను గావింప వీలగునే కాని దేశాభివృద్ధికి అనువగు శాసనములను గావింప వీరికి ఏమాత్రము వీలుండదు. ప్రజాప్రతినిధులసంఖ్య శాసనసభలలో హెచ్చగును కావున ప్రజాభీష్టములను నెరవేర్చుటకు ఇకముందు కొంత అవకాశముగలదు. పదవులను స్వీకరించుటవల్ల ఏ ప్రయోజనము లేదని శాసనసభ్యులు గుర్తించి ప్రజాశయములను అమలునబెట్టుటకు నిరంతరము పాటు పడవలెను. హిందూమతము ఇతర మతములకన్న గొప్పదికావున సంస్కృతమున చక్కనిఅభినివేశము గల వేదాంతులు జాతిమతవిభేదములను పాటింపక వ్యవహరించెడివారని మన ప్రాచీనచరిత్ర దృగ్గోచరముగావించుచున్నది. అస్పృశ్యులు తమంతట

తాము కొంత విద్యనేర్చి తక్కినకులముల వారితో సమాన ప్రతిపత్తికాదలెనని కోరినచో ఇందుకు నెవరును అడ్డుకారు. కాని పైవారిని వీరికి అనుకూలములను గల్పింపుమని ప్రోద్బలపరచినచో అస్పృశ్యత యెన్నటికిని తొలగదని నాకు తోచుచున్నది. ఏజాతివారుకాని కులమువారుకాని తాము భారత పుత్రులని భావింపవలెనేగాని విభేదములను పాటించుటచే దేశము ఔన్నత్యము పొందదని గుర్తింపవలెను. ఇంగ్లాండున ఆంగ్లేయులు, స్కాట్లండువారు, వేల్సువారు కలరు కాని రాజకీయవ్యవహారములలో వీరందరు ఏకముగ వర్తించుచు వారి స్వభాషలను, ఆచారవ్యవహారములను కాపాడుకొనుచున్నారు. ఇదేమోస్తరుగ భారతీయులు వర్తింప యత్నింపవలెను.

దక్షిణాఫ్రికాలో శ్రీగాంధీగారు అస్పృశ్యతను తొలగించునట్లు భారతీయు లనేకులు తలచుట పొరబాటు. శ్రీ లాలా లజపతిరాయి, శ్రీ గోక్లే మున్నగు మహనీయుల మాటలను పెడచెవినిబెట్టి శ్రీగాంధీగారు జనరల్ స్మట్సుతో గావించుకొన్న ఒడంబడిక ఫలితముగ తెల్లవారున్నచోట నల్లవా

రుండరాదని దక్షిణాఫ్రికా వాసులు పట్టుబట్టి యున్నారు. ఎంతోకాలముగ అచ్చట యుంటున్న హిందూమహమ్మదీయులు త్వరలో ఇండియాకు ప్రయాణము కావలెనని యేర్పడెను. కావున జాతిమత విభేదములకు ప్రాముఖ్యత నిచ్చినచో భారతీయులు అధోగతి పొందుదు రనుటకు సందేహము లేదు. నేడు గాకున్నను అచిరకాలమున మనకు స్వాతంత్ర్యము లభించును. కావున సామాన్యవిభేదములను గొప్ప గావించినచో భారతదేశము అభివృద్ధి చెంద జాలదు. శ్రీగాంధీగారు మతమును రాజకీయ వ్యవహారములతో ముడిపెట్టుటచే దేశమునకు అనేక కష్టనష్టములు నేడు సంభవించెను. టర్కీన కెమల్ పాషా మతమును దూరముగబెట్టి రాజ్యాంగ వ్యవహారములలో వీని కేజోక్యము లేక చేసినందుచే టర్కీభావిస్థితి చక్కబడెను. నేటి పరిస్థితిలో యేసిద్ధాంతములకు చోటులేదు. కొందరికి స్వాతంత్ర్యము లభించినను అది నిష్ప్రయోజనము. భారత దేశ స్వాతంత్ర్యమే మన లక్ష్యముగానుంచుకొని శేయింబవళ్లు పాటుపడినగాని మనము మనదేశము అత్యున్నతస్థితికి రాదని మరల విన్నవించుచున్నాను.

చెన్నపట్టణమున 1910 సం॥ ప్రాంతమున తెనుగు వకీళ్లు కొందరు మాత్రమే హైకోర్టున న్యాయవాదులుగనుండిరి. వీరిలో శ్రీపేరి నారాయణమూర్తిగారు కీర్తిగడించి గొప్ప అప్పీళ్లు చేపట్టుచు అరవలచే గౌరవింపబడుచుండిరి. శ్రీవేపా రామేశముగారుకూడ అప్పటికే బి. ఏ., బి. ఎల్., పరీక్షలో అగ్రగణ్యులై న్యాయవాదులైరి కాని వీరికి ఫైలు తక్కువ కావున కొంతకాలమునకు గవర్నమెంటు ప్లీడరైరి. శ్రీపేరి నారాయణమూర్తిగారు నెలకు 4, 5 వేలు ఆర్జించుచు పైకి వచ్చిరి. శ్రీ వి. కృష్ణస్వామిఅయ్యరుగారి ప్రోత్సాహమున శ్రీ బి. ఎన్. శర్మగారు విశాఖపట్టణమువదలి మద్రాసుకు వచ్చిరి కాని, వీరి ఆర్జనకూడ తక్కువగ నుండెను. హైకోర్టు ఒరిజనల్ సైడున శ్రీరంగావఝుల శ్రీరామశాస్త్రిగారు కొంత ప్రాముఖ్యతకు వచ్చిరి కావున వీరు విజయనగరము సంస్థానము దావాను విశాఖపట్టణము జిల్లాకోర్టులో దాఖలుచేయుటకు మరికొందరు వకీళ్లతో నియమింపబడిరి. కొంతకాలము ముందు విజయనగర సంస్థానాధీశుల వంశావళిని నాతండ్రిగారు ముద్రించియుండిరి. కావున దాని తాలూకు వ్రాత

కాపీలను (ఒరిజనల్సు) ఇప్పింపమని కోరిరి. వెవకి యిచ్చెదనని చెప్పగా రెండుమూడురోజుల తర్వాత వచ్చెదమనియు పైకాగితములను తప్పక జాగ్రత చేసియుంచుమనియు చెప్పి వారు వెళ్లిరి. శ్రమపడి ఆ కాగితము లన్నిటిని యిచ్చుటకు యత్నించితిని. కాని కొన్ని దొరకనందున తక్కినవానిని శ్రీరామ శాస్త్రిగారు మరల నావద్దకు వచ్చినపుడు ఇచ్చితిని. ముఖ్యమైన కాగితములు, 1, 2 తప్ప తక్కినవన్నియు దొరకినందుకు వారు సంతృప్తిచెంది విజయనగరము సంస్థానముకేసు విశాఖపట్టణము కోర్టున విచారణకు వచ్చినపుడు నేనచ్చటికివచ్చి తప్పక సాక్ష్యమివ్వవలె నని నొక్కిచెప్పిరి. కోర్టున సాక్ష్యమిచ్చుటకు నా కలవాటులేనందున నన్ను తొలగింపమని యెంత చెప్పినను వారు వినరైరి. కేసు విచారణకు వచ్చు టకు ముందు సాక్షి సమ్మను వచ్చుననియు, మదరాసు నుండి రాకపోకలకు రైలుఖర్చులేగాక బత్తాకూడ నిప్పింపబడుననియు చెప్పిరి. నేను విశాఖపట్టణమునకు రాగానే ఏయంశములగూర్చి నేనెట్లు సాక్ష్య మివ్వ వలెనో ఆసందర్భములను తామగాని, యితర వకీళ్లు గాని నాకు బోధపరతురని శ్రీశాస్త్రిగారు చెప్పి

వెళ్లిరి. ఆ మీాద కొన్ని సంవత్సరములకు నాకు విశాఖపట్టము కోర్టునుండి సమ్మను వచ్చినందున విధి లేక అచ్చటికి వెళ్లవలసి వచ్చెను. 2, 3, రోజులలో నా సాక్ష్యము పూర్తియగునని నేను తలచితిని కాని నెలరోజులకుపైగా నే నచ్చటవుండవలసిన పరిస్థితి నేర్పడెను. కాని అన్నపానాదు లన్నిటికి సంస్థానము బంగళాలో నాకు ఏర్పాట్లు చేసిరి. కాని, ఆలావు తిండి తినలేక అజీర్ణమువల్ల కొన్నిరోజులు బాధ పడవలసి వచ్చెను. విశాఖపట్టణమునసున్న సంస్థాన డాక్టరుచికిత్సవల్ల అనారోగ్యము తగ్గెచు కాని ఆ ప్రాంతపు తిండి జతపడనందున సంస్థాన ఉద్యోగితో మదరాసు భోజనమున కేర్పాటు కావింపుమని కోరగా త్వరలో అట్లే గావింతునని వారుచెప్పిరి. కేసువిచారణను శ్రీమాన్ యస్. శ్రీనివాస అయ్యంగారు ప్రారంభించి పదిరోజులు వాదించిరి. మొదటిసాక్షి నేను కావున శ్రీమంథా సూర్యనారా యణపంతులుగారు సాక్ష్యమున నేను చెప్పవలసిన యంశములను నాకు తెలియబరచిరి. వీరు విజయనగ రము వకీళ్లలో ప్రముఖులనికూడ నాకు తెలిసెను. మరునాడు సోమవారము కాబోలు శ్రీసూర్యనారా

యణపంతులుగారితో నేను జిల్లాకోర్టుకు వెళ్లితిని. 12 గంటలకుమీదన శ్రీమార్ అయ్యంగారు కోర్టునకు రాగానే కోర్టుగుమాస్తాలు నన్ను బోనునెక్కించిరి. శ్రీమార్‌గారు నన్నడిగిన ప్రశ్నలకన్నింటికిని ప్రత్యుత్తరము చెప్పినమీదట రెండు గంటలలో నాసాక్ష్యము పూర్తిఆయెను. కాని కోర్టుఉద్యోగి నాసాక్ష్యము వ్రైపు అగుచున్నదనియు, దానిని కోర్టున నాయెదుట చదివినమీదట అందు చేవ్రాలుచేసి వెళ్లవలెననియు, ఏవైన పొరబాట్లున్న కోర్టున చెప్పవలెననియు సూచించెను. ఏవో రెండువాక్యములను నేనుచెప్పలేదని కోర్టునచెప్పగానే కోర్టుఉద్యోగి ఆవాక్యములను కొట్టివేసి, నావాఙ్మూలము చివర సంతకము చేయుమన్నందునచేసితిని. దేవుడా! అని కోర్టుహాలు వదలి కోర్టువసారాకు రాగానే త్రోవలో వకీళ్లతో మాట్లాడుచుండిన శ్రీమార్ అయ్యంగారు నన్నుపిలిచి నావలె నితరులుకూడ సాక్ష్యమిచ్చినచో కేసు కొన్నిమాసములలో పూర్తియగునని వకీళ్లతో చెప్పగా వింటిని. ఈలోగా విజయనగరము బసలోనున్న సంస్థానఉద్యోగి కాఫీ మున్నగు ఫలహారములతో అచ్చటికివచ్చి

కోర్టువెనుక నొకగదిలో వీనినుంచి నన్నొకగదిలో కూర్చోబెట్టి శ్రీమాన్ గారి వంటమనిషితో "వారికి కావలసిన కాఫీ ఫలహారములను కుంపటిపై సిద్ధము గావింపు"మనిచెప్పెను. వంటమనిషి అన్నిటిని అర్ధ గంటలో సిద్ధముగావించి సంస్థానఉద్యోగికి వార్త పంపగనే 5, 6 మందివకీళ్లు నేనున్న గదిలోనికివచ్చిరి. శ్రీమాన్ గారు రానందున వారిని పిలుచుకొని సంస్థానోద్యోగి రాగానే అందరము ఫలహారములను పుచ్చుకొన ప్రారంభించితిమి. చివరకు అందరము లేచి వెళ్లుచుండగా సంస్థానఉద్యోగి ఎంతో భయ పడుచు నాకు అచ్చటితిండి సరిపడక జబ్బుచేసినందున శ్రీమాన్ గారి వంటలో కొంత నాకు తిండిపెట్టమని శ్రీమాన్ గారితో చెప్పగ వా రిందుకు సమ్మతించి వంటవాని పిలిచి నాకు కావలసినట్లు అన్నముపెట్టు మనిచెప్పిరి. ఆమీాద నేను శ్రీసూర్యనారాయణ పంతులను మదరాసువెళ్లుటకు అనుమతికోరుచు ఇంకను నే నెన్నిరోజు లచ్చటనుండవలసియుండునని ప్రశ్నింపగా 2, 3 రోజులలో జడ్జీగా రీసందర్భమును తెలియజేయుదురనిచెప్పిరి. నాటిరాత్రి మొదలు శ్రీ అయ్యంగారికి తయారగుభోజనమున చారు, పులుసు

మున్నగునవి లభించెను కావున క్రమేణ నీరసము తగ్గి నేను ఆరోగ్యవంతుడనైతిని. మొదటిరోజున వంటమనిషి శ్రీమార్గగారు భుజించినమీదట నా కన్నముపెట్టెను. ఈసంగతి వారు మరునాడు తెలిసికొని నాకుకూడ రెండుపూటల తనతోపాటు విస్తరి వేయుమని తెలియజేసిరి కావున నెమ్మదిగ కొన్ని రోజులు విశాఖపట్టణమున శ్రీమార్గగారి సాన్నిధ్యమున తిండితినుచు సాయంత్రము వకీళ్లతోపాటు అక్కడి బీచికివెళ్లుచుంటిని. పదిరోజులమీదట నేను మదరాసుకు వెళ్లవచ్చుననియు, మరల సమ్మను వచ్చినచో అప్పుడు రావలెననియుచెప్పిరి. నాటి మధ్యాహ్నము కోర్టున వకీళ్లనందరిని సందర్శించి నేను మరునాటి యుదయము ప్రయాణమగుచున్నానని వారితో చెప్పి శెలవుపుచ్చుకొంటిని. రాత్రి 7 గంటలకు శ్రీమార్గగారితో తిండితినుచు నేను చెన్నపురికి వెళ్లుచున్నాననిచెప్పగా నాపుట్టుపూర్వోత్తరములను విచారించి యెన్నియో ప్రశ్నలవేసిరి. ఇట్లుండగా శ్రీగురుజాడ అప్పారావుగారు శ్రీమార్గగారితో మాట్లాడుటకు వీరి బసకువచ్చిరి. నేను బయటికివెళ్లితినిగాని శ్రీ అప్పారావుగారు నన్ను

పిలిచి శ్రీమాక్‌గారితో "వీరితండ్రి గొప్ప సంస్కృతాంధ్రవిద్వాంసుడు. చెన్నపట్టణమున ప్రథమమున ఒక ముద్రాక్షరశాలనిర్మించి అనేక సంస్కృతాంధ్ర గ్రంథములను సంస్కరించి ముద్రించిరి. వీరు మొట్టమొదట శ్రీమద్రామాయణము, అమరముటీక, భారతము భాగవతము మున్నగు గ్రంథములను ముద్రించుటచే తెనుగు ప్రాంతమున అపార కీర్తిగడింపగల్గిరి. నన్ను శ్రీఆనందగజపతి మహారాజావారికి నెరుకపరచి నాచదువుకు సహాయము చేసిరి," మున్నగు సంగతులుచెప్పగానే శ్రీమాక్‌గారు నన్ను కుర్చీమీద కూర్చొనుమనిచెప్పి, తాను చెన్నపట్టణమునకుతరలిరాగానే అప్పుడప్పుడు కనబడుచుండుమని చెప్పిరి.

## 11

శ్రీమాక్‌గారు అడ్వకేటు జనరలుపదవిని వదలిన మీదట మదరాసు యూనివర్సిటీ ప్రతినిధిగ మదరాసు శాసనసభను ప్రవేశింప నిశ్చయించుకొనిరి. ఈఎన్నికలకు పట్టభద్రులు ఓటర్లు కావున అరవ జిల్లాలలోని ఓట్లు హెచ్చుగ తనకు లభించుననియు, తెనుగుజిల్లాల ఓట్లను అచ్చటచ్చట కొందరు వకీళ్లు

సంపాదింతురు కాని ప్రత్యేకముగ ఒకమనిషి అవసర మనియుతలచి కాబోలు నన్ను ఈపనికి నియమించిరి. నాస్వంతఖర్చులతో అనేకులకు జాబులు వ్రాయు టయేగాక స్వయముగా కొన్నిచోట్లకువెళ్లి దాదాపు వెయ్యి ఓట్లకుపైగా నేను సంపాదింపగల్గితిని. తక్కిన వారికన్న ఈపని నేను చక్కగ నిర్వహించితిననియు, తనకు సంతృప్తికలిగినదనియు శ్రీమాణ్ గారుచెప్పిరి. ఈయెన్నికలో వీరు జయమొందినమీాదట శ్రీ కె. భాష్యముగారు వీరిగౌరవార్థము గొప్పవిందు గావిం చిరి. దానికి నేను వెళ్లియుంటిని. శ్రీమాణ్ గారు నన్నుచూడగనే దూరముగ కూర్చొనరాదనిచెప్పి వెంటబెట్టుకొనివెళ్లి తనప్రక్కన కూర్చొనుమనిరి. ఇందుచే వీరికి నాపైప్రీతి యేర్పడెనని తలచితిని.

1920 సం॥న బందరు వాస్తవ్యులు శ్రీకోపల్లె కృష్ణరావుపంతులుగారి శ్రోత్రియగ్రామమగు అరియ లూరును కొనుటకు యత్నించితిని. నావద్ద పైకము లేనందున శ్రీ వి. ఎల్. శాస్త్రిగారిని శ్రీమాణ్ గారితో మాట్లాడమని పంపితిని. శ్రీశాస్త్రి ఇరువది వేలు నాకు అప్పుకావలెనని చెప్పగానే తప్పక ఈ సొమ్మునిచ్చుటకు అభ్యంతరములేదనిచెప్పి కొన్ని

రోజులకు సొమ్మునిచ్చిరి. అది మొదలు ప్రతినెల నేను వారికి వడ్డీచెల్లించుచు కొంతకాలమునకు అప్పు పూర్తిగ చెల్లించితిని. తనవద్ద అప్పు పుచ్చుకొన్న వారిలో నేనొక్కడనే మాటతప్పక అప్పుతీర్చితినని వీరు ఇతరులతో చెప్పుచుండిరని వింటిని. కావున నాపై వీరికి నమ్మకము యేర్పడెనని విస్పష్టమాయెను.

వీరితో దూర ప్రయాణములు సాగించునప్పుడు వీరి జూనియర్లగు శ్రీ కే. భాష్యమువంటివారు వీరివద్ద సొమ్ముపుచ్చుకొని ఖర్చుపెట్టెడివారు. వారు వీరిచ్చిన సొమ్మునకు లెక్కచెప్పుట లేదనియు, నన్నీపనిని చూడు మనియు వీరు చెప్పుచుండిరికాని శ్రీ కే.భాష్యము వంటివారికి అసంతృప్తి కలుగునని తలచి నే నీపనికి పూనుకొనైతిని. తన జూనియర్లు పైకి ఎచ్చటికైన వెళ్లి తనసొమ్ము వృథాగాఖర్చు గావించుచున్నారని వీరు కేకలు వేయుచుందురు. కాని నేను వినివిననట్లు వర్తించుచుంటిని. మా ప్రయాణములలో గయా కాంగ్రెసు ప్రయాణము, అమృతసర ప్రయాణము దీర్ఘకాలముసాగెను. గయలో 10 రోజులును, అమృతసరమున దాదాపు నెలరోజులును ఉండుట తటస్థించెను. గయలోని వర్తమానములగూర్చి యిది వరకే చెప్పియుంటిమి.

పంజాబుఅల్లరులు కాగానే ఇండియాగవర్న మెంటువిధిలేక లార్డు హంటర్ యాజమాన్యమున ఒక కమీషను నిర్మించెను. ఇందుకు ముందుగ కాంగ్రెసువారు శ్రీసి. ఆర్. దాసు, శ్రీగాంధీ, జస్టిస్ తయాబ్జి మున్నగువారిని ఒక కమిటీగానిర్మించి పంజాబు దురంతపులగూర్చి విచారణసాగింప నేర్పాట్లుగావించిరి కాని శ్రీ సి. ఆర్. దాసుగారుబదిరి హంటర్ కమిటీని సాక్షుల పరీక్షించుటకై ఆదేశింప కావున శ్రీ ఎస్. శ్రీనివాసఅయ్యంగారు కాంగ్రెసు విచారణకమిటీసభ్యులైరి. ప్రతిరోజు 10 గంటలు మొదలు 4 గంటలవరకు హంటర్ కమిటీ సాగుటయు, ఆమీద 5-30 మొదలు 7 గం|| వరకు అమృతసరము సిక్కు దేవాలయమున కాంగ్రెసు విచారణకమిటీ సాగుటయు తటస్థించెను. రెండు కమిటీలకును శ్రీమార్గాగారు హాజరగుచుండిరి. కాంగ్రెసు కమిటీ విచారణలో వీరు ప్రాముఖ్యత వహింపవలసివచ్చెను. ఈరెండు కమిటీలకు నన్ను వెంటరమ్మని వీరు కోరినందున నేనును వెళ్లుచుంటిని. హంటర్ కమిటీని నాకు పనిలేదు కావున అప్పుడప్పుడు మోటారు కారున నేను విశ్రాంతిపుచ్చుకొనుచుంటిని. కాంగ్రెసు

కమిటీన రికార్డులన్నిటిని జాగ్రత్తగ నా స్వాధీనమున యుంచుకొనుటకని శ్రీమార్‌గారి ఆదేశము కావున ఇందుకు సమ్మతించితిని కాని ఈపని అతికష్టముగా నుండెను. సి. ఐ. డి. లు కొన్ని కాగితములను నావద్ద లాగికొనుటకు యత్నించుటచే అనేక కష్టములకు పాలైతిని. చలిప్రదేశము కావున చీకటిపడగానే ఒకటి రెండుసార్లు మూత్రవిసర్జనమునకు అవసర ముండెడిది. దేవాలయ ఆవరణములో మరుగుదొడ్డి లేదు కావున పైకివెళ్లవలసినదిగ నేర్పడెను. అప్పుడు నావద్దనున్న కాకితములను కట్టగట్టి ఒక పెట్టెలోనుంచి వెళ్లుటకు అవకాశము లేకపోయెను. కాకితములను చంకబెట్టుకొనివెళ్లినచో వాటిని లాగికొందురేమో అనుభీతి జనించెను. రెండు రోజులు ఇబ్బందిపడిన మీదట శ్రీమార్‌గారితో నా కష్టములను చెప్పు కొంటిని. వెంటనే వీరు కమిటీకార్యదర్శియగు పండిట్ కే. సంతానముగారితో ఒక ఇనుపపెట్టెను తెప్పించి నాకిమ్మని చెప్పిరి. ఈపెట్టెరాగానే అందు కాకితములనుంచి తలచినపుడు పైకి వెళ్లుచుంటిని. ఈకమిటీల విచారణలలో నేను హాజరైనందుచే నాకు చక్కని అనుభవము అలవడెను. కొంతకాల

మునకు నేను ఇండియన్ బ్యాంకింగు కమిటీనెదు టను, కో ఆపరేటివ్ కమిటీ ముందటను సాక్ష్యమివ్వ వలసివచ్చినపుడు పై యనుభవము మిక్కిలి ఉపకరిం చెను కావున చక్కనిసాక్ష్యము నివ్వగలిగితిని. అమృతసరమున చలి, మంచు అపరిమితము కావున చెన్నపట్నముచేరగనే జబ్బునపడితిని కాని కొన్ని రోజులకు ఆరోగ్యము ఏర్పడెను.

---

# త్రిలిఙ్గ రజతోత్సవసందర్భమున

## శ్రీమాన్ ఎస్. శ్రీనివాసఅయ్యంగారు పంపిన సందేశము.

తెనుగు త్రిలిఙ్గవారపత్రిక రజతోత్సవసందర్భమున శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి కానుక సంచిక సమర్పింతు రని విని సంతోషించుచున్నాను. మేము ఇరువురమును చాల కాలముగ స్నేహితులమై యుండుటచేత ఆయన, ఆయన, శీలము ఆయన సేవ వీనినిగురించి తగినరీతిని వర్ణించుట నాకు కష్టము. విస్తారమై, సత్కార్యాచరణమున వీరు చూపిన నిరాడంబరత్వమును అప్రతిమానము. బలవంతుడు, పేద అను భేదముచూడక పాత్రులయినవారు ఏదర్జావారైనను, ఈయన వారికి గావించిన యెన్నో మేళ్లను వారికి వీరియందుకల కృతజ్ఞతాపూర్వక మైన అనురాగమును వీరికి ఉత్తమమైన స్మరణ చిహ్నములు. ప్రాతకాలపుశీలములోని ఏ సుగుణ ములు మనము నేడు మఱచిపోయి ఎక్కువ ఎక్కువగా నష్టపడుచున్నామో అట్టి సుగుణముల యెడల వీరు వీడరానిభక్తి కనబరచిరి. స్నేహము

నకు నిజమైన అర్థము నెఱింగిన బహు కొద్ది మందిలో ఈయన గణింపదగినవాడు. స్వోత్కర్షాభిలాష లేక సత్యముగ పత్రికా ప్రచురమునకును దేశమునకును సేవచేసినవాడు. చూపునకు ఈయన బహు సాధువు; కాని సునిశితమైన బుద్ధివైశద్యమితనియందుగలదు. నిర్ణయముల చాకచక్యమున్నది. నైతికోత్సాహమును వితరణవృత్తియు గలవారు. తెనుగు, సంస్కృతవాఙ్మయములయెడలను ప్రాచీన భారత ఆదర్శముల యెడలను వీరికి తన్మయత్వము కలదు. వీరి జీవితమునకు ఈ ఆదర్శములే మార్గదర్శకతారలు.

ఈ రజతోత్సవ సందర్భమున త్రిలిఙ్గకును శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులకును నా హృదయపూర్వక అభినందనములు సమర్పించుచున్నాను. వారికి ఆరోగ్యమును, సౌఖ్యమును గలిగి ఇతోధికముగా సేవచేయుటకు అవకాశము కలుగుగాక!

## శ్రీమతి యస్. అంబుజమ్మాళ్ నా షష్ట్యబ్దపూర్తి ఉత్సవము నాడు నన్ను ప్రశంసించుచు పంపినజాబు:—

తమ షష్ట్యబ్దిపూర్త్యుత్సవములకు వచ్చి యానందించు భాగ్యము లేకపోయినందులకు చింతిల్లుచున్నాను. తే 4 ది నాటి పత్రికలలో నీ విషయ

మును చదువగా నీ యుత్సవప్రసక్తి తెలిసినది. నాతమ్ముడు శ్రీ ఎస్. పార్థసారథి చెన్నపురమున లేడు. కొడైకెనాలుకు వెళ్లియున్నాడు. అతనికి మీ యాహ్వానము అందియుండదు.

నేను మీకేమి సందేశ మంపగలను? మీరు మాతండ్రి కీ. శే. ఎస్. శ్రీనివాసఅయ్యంగారుగారికి పరమాప్తులుగ నుంటిరి. స్వయముగా సంస్కృతమున పాండితి వెలయుటచే ఆయన మీ భాషాసేవ గుర్తింపగలిగి సుమారు ముప్పదేండ్లు తమయందు విశ్వాసము వహించియుండిరి. తమ రింకను అమూల్యమగు భాషాసేవ యొనర్పగల్గుటకు శ్రీమన్నారాయణుడు మీకు దీర్ఘాయు వొసంగు గాక! మీ విశాలహృదయమును, వదాన్యతయు నితోధికముగ వర్ధిల్లుగాక!



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1955

# వచనగ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రికృతము, | | | |
| | ఒకటే సంపుటము ... | 9 | 0 |
| ,, | మూడుసంపుటములు ... | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము, శ్రీ ఆకుండి వెంకటశాస్త్రికృతము | | | |
| ,, | ఆదిసభాపర్వములు ... | 5 | 0 |
| ,, | ఆరణ్యపర్వము ... | 5 | 0 |
| ,, | విరాటోద్యోగపర్వములు ... | 5 | 8 |
| ,, | భీష్మద్రోణపర్వములు ... | 7 | 8 |
| ,, | కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ... | 5 | 8 |
| ,, | శాంతిపర్వము ... | 7 | 8 |
| ,, | అనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వమువరకు ... | 7 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము, శ్రీ సరస్వతుల సుబ్బరామశాస్త్రికృతము | | | |
| ,, | బాలకాండము ... | 2 | 8 |
| ,, | అయోధ్యాకాండము ... | 5 | 0 |
| ,, | అరణ్యకాండము ... | 2 | 8 |
| ,, | కిష్కింధాకాండము ... | 2 | 8 |
| ,, | సుందరకాండము ... | 3 | 0 |
| ,, | యుద్ధకాండము ... | 7 | 8 |
| ,, | ఉత్తరకాండము ... | 3 | 8 |
| అనంతసాగరము, ఋక్కరాయ సముద్రచరిత్రము | | 0 | 12 |
| అరేబియన్ నైట్సుకథలు ... | | 2 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అయిదుగురు దొంగలకథలు | ... | 0 | 3 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 3 | 0 |
| ఆంధ్రకవిజీవితములు, శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారిది | ... | 6 | 0 |
| ఈసబునీతికథలు 2-వ భాగము | ... | 0 | 12 |
| ఋషులచరిత్ర, మొదటిభాగము | ... | 1 | 0 |
| చార్ దర్వేషుకథలు | ... | 0 | 8 |
| చిత్రరత్నాకరము, గురుజాడ శ్రీరామమూర్తి | | 1 | 0 |
| జగత్కథ, కొమాండూరు శఠకోపాచార్యులుగారిది | | 6 | 0 |
| జీవితరహస్యములు, చిత్రమైనకథలు | ... | 1 | 8 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 12 |
| శ్రీతిలకుగారి సెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | | 0 | 14 |
| తులసీదాసురామాయణము, వచనము. శ్రీప. శ్రీనివాసరావు | ... | 12 | 8 |
| త్రిలిఙ్గకథలు | ... | 1 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 8 |
| ,, A. S. P. అయ్యరుగారిది | ... | 0 | 8 |
| దక్కనుపూర్వకథలు | ... | 2 | 8 |
| దశకుమారచరిత్రము, సంజీవరాయశాస్త్రి | ... | 3 | 0 |
| ద్వాదశోపనిషత్తులు, తెలుగువచనము | ... | 5 | 0 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 6 |
| నామహారాష్ట్రయాత్ర | ... | 4 | 0 |
| నీతిచంద్రిక, శ్రీచిన్నయసూరిగారిది | ... | 0 | 12 |
| ,, టీకతో | ... | 1 | 4 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| నేటి కాలపుకవిత్వము, శ్రీ అక్కిరాజు ఉమా కాన్తముగారిది ... | 3 | 0 |
| పరమానందశిష్యులకథలు ... | 0 | 4 |
| పంజాబు అల్లరి ... | 0 | 8 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి ... | 0 | 12 |
| పంచతంత్ర హితోపదేశకథామంజరి, A. S. P. అయ్యర్ | 1 | 12 |
| పేరములు చేయుం జాతులచరిత్ర, ప్రతిమలతో | 1 | 0 |
| పురాణ గాథలు I ... | 1 | 0 |
| ,, II ... | 1 | 0 |
| బాజీరాయనిచరిత్ర ... | 1 | 4 |
| బేతాళునికథలు ... | 0 | 12 |
| భారతరమణీమణులు | | |
| ప్రథమభాగము, 21 స్త్రీరత్నములచరిత్ర | 1 | 4 |
| రెండవభాగము, 10 ,, ... | 0 | 10 |
| మూడవభాగము, 12 ,, ... | 0 | 8 |
| భాగవతకథ, ప్రభుదత్తబ్రహ్మచారిది 2-వ భాగము | 2 | 0 |
| భోజునికథలు ... | 1 | 0 |
| భోజకాళిదాసకథలు, I భాగము ... | 1 | 4 |
| II ,, ... | 1 | 4 |
| శ్రీమహాభక్తవిజయము, శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రి | 12 | 0 |
| మర్యాదరామన్నకథలు ... | 0 | 3 |
| మైరావణచరిత్ర ... | 0 | 2 |
| యజుర్వేదకథాసంగ్రహము, 50 చిత్రకథలు, పార్నంది సర్వేశ్వరశాస్త్రి విరచితము ... | 0 | 8 |
| రఘువంశకథ ... | 0 | 10 |
| రాజశేఖరుడు, గోపాలుడు ... | 0 | 12 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| రేచుక్క — పగటిచుక్క కథలు | ... | 0 | 4 |
| వివేకానందవిజయము | ... | అచ్చు | |
| విక్రమార్కచరిత్ర, శ్రీ భాగవతుల రామమూర్తిశాస్త్రిగారిది | ... | 1 | 8 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 12 |
| వీరాంగనలు | ... | 1 | 0 |
| వైద్యులకథలు | ... | 0 | 6 |
| శుకసప్తతికథలు | ... | 0 | 12 |
| షేక్స్పియర్ నాటకకథలు | ... | 2 | 8 |
| సంగ్రహరామాయణము, శ్రీ జ. శేషాద్రిశర్మవిరచితము | | 1 | 8 |
| సంగ్రహభాగవతము | ... | 2 | 8 |
| డిటో (సంగ్రహింపబడినది) విద్యార్థులకై | | 1 | 0 |
| సంస్కృతనాటకకథలు, శ్రీ సీతారామశాస్త్రిగారిది 1, 2 భాగములు | ... | 2 | 0 |
| ,, బులుసు వేంకటరమణయ్యగారిది 3 వ భాగము | | 2 | 0 |
| సత్యసేనవిజయము | ... | 0 | 6 |
| 'సైన్సు' పైలోకమాహాత్మ్యారోపణ (ప్రహసనము) | | 0 | 8 |
| సోమనాథుఁడెప్పటివాడు | ... | 1 | 0 |
| శకుంతల ప్రతిమలతో | ... | 0 | 6 |
| నల ,, | ... | 0 | 8 |
| హరిశ్చంద్ర ,, | ... | 0 | 8 |
| సావిత్రి ,, | ... | 0 | 6 |
| ప్రహ్లాద ,, | ... | 0 | 6 |
| కాశీమాహాత్మ్యము, తెనుఁగువచనము | ... | 1 | 0 |
| గయామాహాత్మ్యము, తెనుఁగువచనము | ... | 0 | 10 |